నాంధ్ర సంస్కృత వాఙ్మయములయందలి సుప్రసిద్ధ ప్రాచీన కావ్యము లనేకము ప్రకటించినది, మాకార్యమును గమనించుచున్న భాషాభిమాను లెఱిఁగియున్న విషయమే! అందు నిమగ్నులమై యీకార్యము నేమరినవారల మైతిమి.

ఇంకొక్కమాట! ఇతరులు ప్రకటించిన భాషాంతరీకరణములమూల్య మధికమనియు, శైలిమిక్కిలి ప్రౌఢమనియు ననేకులు చెప్పుచుండుటచే, మేము పరభాషలయందు, పరసాంఘికాచారములఁ బ్రకటించు వర్ణనాదులఁ దగ్గించి 'ఆక్సుఫర్డు' విశ్వవిద్యాలయము వారాంగ్లేయభాషయందలి 'సరు వాల్టర్ స్కాట్టు' మున్నగు గ్రంథకర్తల నవలల **"Retold For Indian Students"** అని ప్రకటించు గ్రంథరాజముల వలె సులభమైనశైలిలోఁ బ్రకటించుచున్నాము. ఈనవలల యందుఁ గథాచమత్కారమును, రసవంతమగుభాగములును దగ్గింపకుండ, పరసంఘాచారములును, సౌందర్యాదివర్ణనములును, విద్యార్థులకు, స్త్రీలకుఁ దెలియనిప్రౌఢ; హాస్యాదిప్రసంగములను మాత్రము సాధ్యమైనంతవఱకుఁ దగ్గించి సంస్కృత సమాసములు లేకుండ, పఠనీయముగ నుండున ట్లొనరింపఁజేసితిమి. ఈమార్పువలనఁ గథకు భంగము లేదు సరికదా, యెల్లవారికి సులభముగ నర్థమగును. నవలలకుఁగూడ నిఘంటువులు చూచుకొన నవసరము లేకుండ నుండును. రసవంతములగు పలుతావుల మూలకథ యున్నది యున్నట్లే యుంచితిమి.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
**292, ఎస్ప్లనేడ్, చెన్నపురి, ఈ.**



శ్రీ రస్తు.

# దుర్గేశనందని

## ప్రథమభాగము.

### మొదటి ప్రకరణము.

వంగశకము 998-వ సంవత్సరపు వేసవికాలమునందలి తుదిదినములలో నొకపురుషుఁడు విష్ణుపురమునుండి జహానాబాదునకుఁ బోవుబాట నొంటరిగ గుఱ్ఱము నెక్కి పోవుచుండెను. ప్రొద్దుగ్రుంకువేళ యైనది. ఆతఁడు చాలదూరము పోవలసియుండెను. దారిలో నాఁగుటకు వీలైన చోటుకూడ లేదు. ఆదినములలో సాయంకాలమునందు గాలిదుమారములు వచ్చి, వర్షముగా మాఱుటకూడఁ గలదు. అది బాటసారులకు మిగుల కష్టము. కావున నతఁడు త్వరగఁ బోవ నాత్రపడుచు గుఱ్ఱము నురికించుచుండెను. క్రమముగాఁ జీఁకటి పడినది. నల్లనిమబ్బు వేసినది. మన్ను మిన్ను కనఁబడుట లేదు. గుఱ్ఱమును మెఱుపు వెలుఁగున నతి కష్టముతో నడుపుచుండెను. వర్షము, గాలి, ప్రారంభ మయ్యెను. బాటసారి కేమిచేయుటకును దోఁపలేదు. కళ్లెమును విడిచివైచెను. గుఱ్ఱము దానియిష్టమువచ్చిన వైపునకుఁ బోవుచుండెను. కొంతదూరము పోవుసరికి గుఱ్ఱముకా

లున కేదియో టక్కుమని తగిలెను. ఇంతలో మెఱపుకాంతి వలన నెదుట తెల్లనివస్తు వెద్దియో యెత్తుగా నున్నట్లు కనుపించెను. బాటసారి యది యొకయింటిగుమ్మమని తలంచెను. గుఱ్ఱమునుండి దిగెను. రాతిసోపానములేయవి. ఇచ్చట నిలువ నీడ దొరకునని యాతఁడామెట్ల నెక్కెను. మెఱపుకాంతిలో నెదుట నున్నది యొకదేవాలయ మని బాటసారి తెలిసికొనెను. అతఁడు ద్వారమును సమీపించెను. తలుపు వేసి యున్నది. అతఁడు తలుపును జేతితోఁ దడవిచూచెను. పైని గొళ్లెము వేసియుండలేదు. ఈయడవియందీసమయమున నిందెవ్వరుండి యుందురని బాటసారి యాశ్చర్యము నొందెను. మొత్తుచున్న వర్షములో నతఁడు తడసిపోవుచుండెను. అతఁడు తలుపును జేతితోఁ దట్టెను. ఎవ్వరును బలుకలేదు. ఎంత తట్టినను దలుపులు వీడలేదు. అతనికిఁ గోపము వచ్చి తలుపును దన్నఁదలంచెను. దేవాలయమని సందేహించెను. అతఁడు గట్టిగాఁ గొట్టుటచేఁ గఱ్ఱగడియ కొంతసేపటి కూడిపోయెను. తలుపులను దెఱచుటకు గాలి సాయపడుటచే బాటసారి కష్టపడ నక్కఱ లేకపోయెను. అతఁడు లోని కడుగుపెట్టుసరికి గాలి ముందుగా దేవాలయములోనికి రివ్వునఁ బోయి దీపమార్చెను. ఎద్దియో ధ్వని వినఁబడెను. లోపలనున్నవా రెవరైనది కాని, విగ్రహమే దేవునిదో కాని యాతనికిఁ దెలియలేదు. బాటసారి ధైర్యవంతుఁడు. తనయిప్పటిచర్య కాతఁడే నవ్వుకొనెను. లోనిదేవున కాతఁడు భక్తితో నమస్కరించెను.

"ఇం దెవ్వరున్నారు?" అని యాతఁడు ప్రశ్నించెను. ప్రత్యుత్తరము లేదు. ఆభరణములసవ్వడి యయ్యెను. ఇంకఁ

ప్రశ్నించిన లాభము లేదనుకొని బాటసారి వానజల్లు రాకుం డఁ దలుపులు మూసి, గాలిచే మరలఁ దలుపులు రాకుండ వాని నానుకొని యాతఁడు కూర్చుండెను. మరల నిట్లు గట్టిగాఁ జెప్పెను. "చేతఁ గత్తితో నేనిటఁగూరుచుంటిని. ఇందున్న వారు పురుషులై నాకపాయము చేయఁదలఁచిన మీకశుభమగును. స్త్రీలిందుండినచో భయము లేదు. ఈరాజపుత్రుని చేత నాయు ధము లున్నంతవఱకు మీకపాయము రాదు."

"మీ రెవ రయ్యా?" అని యెవ్వరో ప్రశ్నించిరి. అది స్త్రీల కంఠస్వరమువలె నున్నది. "మీ రెవ్వరో యాఁడువాండ్ర వలె నున్నారు. నావివరములతో మీకేమిలాభము?" అని బాట సారి పలికెను.

"అయ్యా! మాకుఁ జాల భయ మగుచున్నది."

"మమ్ములగుఱించి మేము చెప్పుకొనరాదు. అది మా కులాచారము కాదు. అబలలైనమీకు నేనిచ్చట నుండునంత సేపు నేభయమును లేదు."

"అయ్యా! మీమాటలవలన మాకుఁ గొంతధైర్యము కలిగినది. ఇప్పటివఱకును జీవితములపై నాసయే లేదు. ప్రాణము లఱచేతఁబెట్టుకొంటిమి. నాచెలి మూర్ఛిల్లినది. ఆమె యింకను లేవలేదు. మేమీశైలేశ్వరునిఁ బూజించుటకు సాయంకాల మున కిట వచ్చితిమి. దబాటుగా వచ్చిన వర్షమునకు మాసేవ కులు పల్లకితోఁ జెల్లాచెదరై పోయిరి."

"భయము లేదు. సేదఁ దీర్చుకొనుఁడు. ఉదయమున మిమ్ముల సురక్షితముగాఁ బంపివేయుదును."

"ఈశైలేశ్వరుఁడు మిమ్మనుగ్రహించును గాక!"

రాత్రి సగము గడచునప్పటికివర్షము తగ్గినది. గాలి లేదు. బాటసారి యిట్లు పలికెను.

"నే నీసమీపమునందలిపల్లెకుఁబోయి దీపమును దెచ్చెదను, మీ రంతవఱకు ధైర్యముతో నుండుఁడు."

"అయ్యో! మీ రంతదూరము పో నక్కఱలేదు. ఈ గుడి పూజరి యి ల్లీసమీపముననే యున్నది. వెన్నెల వచ్చినది. మీరు తలుపులఁదెఱచినచో మీ కాతనియి ల్లగపడును. అచ్చట దీప ముండును." అని మొదటికాంత చెప్పెను.

బాటసారి తలుపులు తెఱచెను. వెన్నెలలో నర్చకుని గృహ మగపడెను. ఆతఁ డచ్చటికిఁ బోయి పూజరి తలుపు తట్టెను. పూజరి దొంగలభయముచేఁ బలుకలేదు. తలుపుసందులనుండి బాటసారినిఁ జూచి, విలువగలయాతనిదుస్తులనుబట్టి యాతఁడు దొంగ కాఁజాలఁడని యెంచి తలుపుఁదెఱచి దీపము వెలిఁగించెను.

బాటసారి దీపమును దెచ్చి దేవాలయమునందలి విగ్రహమునుజూచెను. అది తెల్లనిలింగము. దానివెనుక నిద్దఱుస్త్రీలుండిరి. అందొకతె యౌవనవతి. ఆమెచేతుల నున్నయాభరణములు మెఱయ, దీపమును జూచుటతోడనే మేలిముసుఁగు వైచికొనెను. ఆమె ధరించిన మార్వారీకంకణములును, జిలుగు జరీవస్త్రములను చూచి యామె యొకగొప్పయింటిపడుచని బాటసారి తలంచెను. ఇంతవఱకుఁ దనతో మాటలాడినయామె శరీరముపైఁ దక్కువవిలువగల నగ లుండుటచే నామె యాయువతిపరిచారి కయై యుండునని బాటసారి తలంచెను. పరిచారిక వయసు ముప్పదియేం డ్లుండవచ్చును. ఆమెయైనఁ

దక్కువనగల ధరించియుండలేదు. వారివేషము లుత్తరహిందూ దేశపువనితలకువలె నున్నవి. వంగదేశపువేషములు కావు. వారలఁజూచి యాతఁ డద్భుతపడెను.

దీప మిచ్చుట నుంచి బొటసారి వారి కెదురుగ నిలువఁ బడెను. దీపపువెలుతురులో నాతని కిరువదియైదేండ్లయీడుండు నని యావనిత లనుకొనిరి. సుందర మైనయాకారము కల వాఁడే! ఆతఁడు కొంచెము పొడగరి. అది యాతనిసౌందర్య మునకు లోపము తెచ్చి పెట్టలేదు. నడుమునఁ గాసెకోకయు, శరీరముపై నున్న యితరాలంకారములు, నాతని రాజపుత్త్రుఁ డని చెప్పక చెప్పుచుండెను. నడుమున నొకకత్తి వ్రేలాడు చుండెను. వజ్రములు గలతలపాగయు, చెవుల ముత్యాల తాటంకములును, మెడలోనిహారమును నాతనియాకారము నకు సరిపడి యుండెను. యువతీయువకు లొకరినొకరు చూచు కొనిరి. కాని మాటలాడుట కిరువురును సంశయ మొందు చుండిరి.

---

## రెండవప్రకరణము.

చివరకు రాజపుత్త్రుఁడే మొదటఁ దన్ను మాటలాడించి యాపెతో మాటలాడెను. "అమ్మా! మీరు గొప్పయింటి వారివలె నగపడుచున్నారు. మీ రెవ్వరో తెలిసికొనుట కిష్ట ముండినను; నావలెనే మీరును మీవృత్తాంతమును దెలుప నభ్యంతరము కలవా రేమో యని సందేహించుచున్నాను.

మీకట్టియభ్యంతరము లేనియెడల మీవివరములను దెలుపఁ గోరెదను."

"స్త్రీ లెప్పుడైన ముందుగాఁ దమ్ముఁ దామెఱిఁగించు కొందురా?"

"ఒండొరులను దెలిసికొనుటలో ముందువెనుకల ప్రసంగమేల?"

"తన గొప్పతనము స్త్రీ తానెట్లు చెప్పుకొనఁగలదు? గృహమునసేయుండి, భర్తనే దైవముగఁ దలంచుచుండవలసిన స్త్రీలకుఁ దమవివరముల నితరులతోఁ బ్రసంగించుటకు స్వాతంత్ర్య మెచ్చటిది?"

బాటసారి యీమాటలకుఁ బ్రత్యుత్తర మీయక యోజించుచుండెను. రెండవయువతి కొంచెము కొంచెము మేలిముసుఁగును దొలఁగించి, బాటసారినిఁ జూచుచుండెను. మాటలసందర్భమున నాతనిచూపు లామెవదనముపై నిఁబడెను. అచ్చట నవి నాటుకొనెను. ఆమె నిరుపమానసౌందర్యవతి యని యాతఁ డనుకొనెను. ఆయువతీయువకులచూపు లన్యోన్యము కలుసుకొనినవి. యువతి ముఖము వంచెను. తనమాటలకు బదులీయని బాటసారియోజనలను బరిచారిక గ్రహించెను. తనచెలి చిత్తావేగమును దెలిసికొనెను. పరిచారిక చెలితో రహస్యముగ "నిది ఏమి? దేవాలయమునందే పెండ్లియా?" అని పరిహాసించెను.

"చాలు చాలు" నని యువతి పరిచారికను గిల్లెను.

పరిచారిక తెలివికలది. సంగతి గ్రహించినది. "ఈమె కితనిపై ననురాగము కలుగుచున్నది. దానిఫలితము మే

మీతని విడిచిన పిమ్మట నీయువతికిఁ దెలియును. ఈమె యువ కొనికొలఁకు బెంగపెట్టుకొనును. శ్రుతి మించకుండ నిటనుండి పోవుట మంచిది" అని యోచించి "అయ్యా! ఆఁడువాండ్ర ప్రతిష్ఠ చంచలమైనది, కొలఁది గాలితాకుడుకైన నిలువదు. ఈనాఁటి ప్రచండవాయువుమాట చెప్పవలయునా? మేమింటికి నడచి పోవుదుము, మాకు సెలవిండు" అని పరిచారిక యనెను.

"ఇప్పుడే చీఁకటిలోఁ బోవలసినయెడ నేను మీయింటి కడకు సాయము వచ్చి యొప్పగించెదను. నే నిదివఱకే మా యింటికి పోయి యుండవలసినది. అయినను మీచెలి సౌంద ర్యము నన్ను పోనిచ్చుట లేదు."

"మీరు మాయందు మిక్కిలి దయఁ జూపినారు. మీ రెఱుఁగని దేమున్నది? ఆఁడువాండ్ర జీవితము దుర్భరము. అనుమానాస్పదము. అందు మీవంటిపురుషుని వెంటఁబెట్టు కొని పోయినయెడల గలుగు ఫలితము వేఱుగఁ జెప్పవలెనా? మీయెడఁ గృతఘ్నులము కాము. మమ్ము పోనిండు."

బాటసారి కొంచెము యోజించి యిట్లు బదులు చెప్పెను.

"మానసింహమహారాజు తనయునితోఁ బోయినయెడఁ జిక్కుండునా?"

ఆయబలల కీసమాచారము పిడుగు మొత్తిన ట్లయ్యెను. వారు లేచి నిలువఁబడిరి. యువతి శిలావిగ్రహముదాపునకుఁ బోయినది. పరిచారిక వినయముతో నిట్లు పలికెను. "రాజ

కుమారా ! మన్నింపుము. తెలియక యపరాధము లొనరించితిమి."

"ఈయపరాధములకు మన్నన లేదు. మీ రెవ్వరో చెప్పినయెడల నే నవి మఱచి పోయెదను. లేకున్న శిక్ష జరుగక తప్పదు" అని జగత్సింహుఁడు నవ్వుచుఁ బలికెను.

అతనిమెత్తనిమాటలు పరిచారికకుఁ గొంచెము ధైర్యమును గలుగఁజేసెను. "ఆశిక్ష యేమియో సెలవిండు. సిద్ధముగ నున్నాము." అని యామె యడిగెను.

"మిమ్ముల నింటికిఁ దీసికొని పోవుటయే!" అని యాతఁడనెను. పరిచారికకు బదులుమాట తోఁచుట లేదు. ఢిల్లీ సార్వభౌమునిసేనాధిపతికిఁ దన చెలిసమాచారముఁ జెప్ప నిష్టము లేదు. దానికొక ప్రత్యేకకారణ ముండవలెను. అతఁడు తమతో వచ్చుట కామెకు మొదలే యిష్టము లేదు. ఆమె తలవంచి యోచించుచుండెను.

ఇంతలోఁ జాలదూరమున నశ్వము లెన్నియో వచ్చుచున్నట్లు గిట్టలచప్పు డయ్యెను. రాజు బయటికిఁ బోయి చూచెను. నూఱుగురు గుఱ్ఱముల నెక్కి వచ్చిరి. అతఁడు వారిదుస్తుల గుర్తించెను. వా రాతని రాజపుత్రసైనికులే. కొలఁదిదినముక్రిత మీతఁడు యుద్ధసంబంధమైన కార్యముపై విష్ణుపురమునకుఁ బోయెను. వారిని వెనుక విడిచి తండ్రి కడకుఁ బోవుచున్న యాతఁడు నాఁడు మధ్యాహ్నము ముందుగాఁ బయనమై వచ్చుచుండ పాఠకులకుఁ బరిచితుఁ డయ్యెను. ఇప్పుడు వచ్చినవా రాసైనికులే! అందు జేరువకు వచ్చుచున్న

యొకసైనికునిఁ బిలిచి "ధర్మసింహా! వర్షమువలన నేనిట నాఁగి పోయితి" ననెను.

ధర్మసింహుఁడు భక్తితో వందన మొనర్చి, "మీ గుఱ్ఱపుడెక్కలజాడ ననుసరించి వెదకికొనుచు నిటకు వచ్చితిమి. దేవర గుఱ్ఱ మూ మఱ్ఱి చెట్టుక్రింద నగపడినది. మీ రీప్రాంతములయం దుందురని దానిని దీసికొనివచ్చినారము" అనెను.

మంచిది. "నీవిప్పు డిరువురు మనుష్యుల నీ ప్రక్కనున్న పల్లెకుఁబంపి పల్లకితోఁగూడ బోయవాండ్రను దీసికొని రమ్మనుము."

ధర్మసింహుఁ డిప్పుడు రాజునకుఁ బల్లకితోఁ బనియేమని యాశ్చర్యము గొనెను. కాని వివరము లడుగ సాహసింప లేదు.

ధర్మసింహుఁ డిరువురు రౌతులను బోయవాండ్ర కొఱ కంపెను. వారింకను రాలేదు. ఇంతలో నా యాఁడువాండ్రను మొదట దేవాలయమునకుఁ దీసికొనివచ్చిన బోయవాండ్రును మనుజులును పల్లకితో గుడికడకు వచ్చుచుండిరి. పరిచారిక వారిని గుర్తించెను. విమల యాసంగతి యువతితోఁ జెప్పెను.

అప్పుడు రాకొమారుండు వారికడ సెలవు తీసికొని వెడలి పోవుచుఁ బరిచారిక యగు విమలకు రాకొమారుఁడొక ముత్యాలహారము నిచ్చెను. విమల దానిని భక్తిపూర్వకముగఁ దీసికొని కొప్పునఁ జుట్టుకొనుచు "ప్రభూ! మీరు మా వివరములను గుఱించి ప్రశ్నించితిరి. దానికి మేము ప్రత్యుత్తరము చెప్పలేదు. ఆవిషయము మీ రంతగా వినఁదలఁచినయెడఁ బదు

నేఁడువినములకుఁ బిమ్మట మిమ్మెటుఁ గలసికొనఁగలనో సెలవిచ్చెదరా?" అని యడిగెను.

"ఈగుడియందే మరల సరిగఁ బదునేనవదినమున నన్నిక్కడఁ జూడఁగలవు. లేకుండిన నిఁక మనము కలిసికొనఁజాలము."

"దేవుఁడు మిమ్ము రక్షించునుగాక!" అని విమల పలికెను.

జగత్సింగు మరల నాయువతివైపునకుఁ బ్రేమతోఁజూచి గుఱ్ఱముపై నెక్కి యగపడకుండఁ బోయెను.

---

## మూఁడవ ప్రకరణము.

ఒరిస్సా దేశమునందుఁ జెలరేగుచున్న పఠానులకును, ఢిల్లీ సార్వభౌముఁడగు నక్బరుచక్రవర్తికిని యుద్ధములు జరుగుచుండెను. 997-వ సంవత్సరము మొదలు మానసింగు వంగ దేశమువైపుల నల్లరు లణఁచి, చక్రవర్తిపక్షమున నిప్పుడొరిస్సాప్రాంతముల యల్లరు లణంప వచ్చెను. ఈతనికుమారుఁడగు జగత్సింహుఁడు రాజకార్యములపై విష్ణుపురమునుండి మరలి, తండ్రికడకుఁ జేరెను. పఠాను లుత్కలదేశమునందుఁ జేయుచున్న బందిపోటులు మున్నగు క్రూరచర్య లన్నియుఁ జెప్పి, అప్పుడు యుద్ధమునకు వీలులేక ఆగియును తండ్రి నంగీకరింపఁజేసి, జగత్సింహుఁడు వెంటనే యైదువేలసైన్యముతో "కటక్ ఖానుఁ" డను పఠానునాయకుని నోడించుటకు బయలు

దేరెను. అంత స్వల్పసేనతోఁ బఠానుల నురుమాడుటకు శప థముచేసిపోవుచున్న జగత్సింహుని ధైర్యసాహసములకు యోధులెల్లరు నాశ్చర్యము నొందిరి. పుత్రునిపై నున్న ప్రేముడి విడిచి, రాజపుత్రసహజమగు పరాక్రమచిహ్నములకు సంత సించి, పుత్రు నాశీర్వదించి, మానసింగు జగత్సింహుని ముం దుగా నుత్కలమునకుఁ బంపెను. జగత్సింహుఁడును స్వల్ప సైన్యముతోఁ బఠానుల నెదిరింపక యచ్చటచ్చట తనసైన్య ములో గుంపులుగుంపులుగా దాఁచి యుంచి యాకస్మిక ముగాఁ బఠానులగుంపులపైఁ బడి వారిని చీల్చి చెండాడు చుండెను. బందిపోటుదొంగతనములకుఁ బోవుచున్న పఠాను గుంపు లెన్నియో జగత్సింహునిచే మడియుటచే, వారు చాల వఱకు బలహీనులై పోయిరి. వారు కోటల విడిచివిడిచి వచ్చు టకే భయపడుచుండిరి. ఈయుపాయమునకు మానసింగు మెచ్చి కుమారునకు మఱి పదివేలసైన్యమును సాయమంపెను. ఈ చరిత్ర నొకింతసేపు మఱచి మనము విమల నొకసారి దర్శింపవలసియున్నది కదా!

ఇప్పటికిని విష్ణుపురమునుండి జహనాబాదునకు జగత్సిం హుఁడు ప్రయాణము చేసినబాటగుఱుతు లున్నవి. ఆబాటకు దక్షిణమునఁ గొంతదూరముననే మందరగడ మనునొకపట్టణ ముండెడిది. దేవాలయములో జగత్సింహునిఁ గలిసికొనినస్త్రీ లీపట్టణమునకే పోయిరి. ఈనగరమునఁ బురాతన మగుకోట లెన్నియోయున్నవి. ఆమోదరానది యాపట్టణముగుండఁ బ్రవ హించును. మూఁడుకోణములుగనున్న యాపట్టణమునకు మలుపు తిరిగి రెండువైపుల నానది వ్యాపించియున్నది. ఆనదిలోనికిఁ

జొచ్చియున్న పర్వతమునుఁబోలిచి యున్నతమగు నొకొండపై నొకబలిష్ఠమగుకోట నిర్మించిరి. అది నల్లరాతికోట. కాని ప్రాత వడ్డది. కోటవెలుపల చింతలు, మామిళ్లు, జిల్లేళ్లు, పొదలు, పుట్టలు, పెరిగి చిన్నయరణ్యమువలె నుండును. అందెన్నియో మృగములు వసియించుచుండును. ఇప్పుడాకోటలోఁ గొందఱు భాగ్యవంతులు మాత్రము వసించుచున్నారు. 998-వ సంవత్సరమునాఁటికీ కోట జయధారసింహుని వంశీయుఁడగువీరేంద్ర సింహుని స్వాధీనమునం దున్నది.

వీరేంద్రసింహుఁడు దురహంకారి. చిన్నతనములో నీతని కినిఁ దండ్రికిని సరిపడలేదు. వీరేంద్రుఁడు తండ్రియిష్టమునకు వ్యతిరేకముగ నొక పేదబాలికను రహస్యముగఁ బెండ్లియాడెను. తండ్రి వీరేంద్రు నిలువెడలఁ గొట్టెను. వీరేంద్రుఁ డప్పటికి గర్భిణి యగుభార్యను విడిచి ఢిల్లీపట్టణమునకుఁ బోయి సైన్యములోఁ జేరెను. కొన్నిదినములకుఁ దండ్రి విచారించి కుమారుఁడు పెండ్లియాడినగర్భవతి యగు పేదకోడలి నింటికిఁ దెచ్చెను. ఆమె యాఁడుశిశువును గని మరణించెను. ఆ బాలిక పేరు తిలోత్తమ. ఆమెను తాతయే పెంచుచుండెను. కొన్ని దినములకుఁ దండ్రి మరణించెనని విని వీరేంద్రుఁ డుద్యోగము మాని సంపాదించినధనముతో నింటికి వచ్చెను. ఇప్పు డాతఁడీ కోటలోనే వసియించుచుండెను. తిలోత్తమయం దాతని కపరిమితప్రేమ ముదయించుటచేఁ దనూజాతను మిగుల గారాబముతోఁ బెంచుచుండెను. ఈమెనే విమలవెంటనుండఁగా మన జగత్సింహుఁడు గుడిలోఁ జూచినది. ఢిల్లీనుండి వీరేంద్రుఁ డనేకపరిజనులను వెంటఁ దీసికొని వచ్చెను. అందు విమల,అభి

రామస్వామి, ఆష్మానీ అను ముగ్గురితోడను మనకుఁ బనియున్నది. విమల నందఱు పరిచారిక యనుకొనుచున్నారు. మనము నిదివఱ కన్నే యెంచితిమి. ఇంక ముందు నన్నే యందము.

ఈమె వీరేంద్రునిగృహవిషయికము లగుపనులన్నియుఁ జూచుచుండును. మఱియుఁ దిలోత్తమయెడ నామె మిగుల శ్రద్ధవహించియుండును. కోటలో నుండుట కామె కితరకారణము లెవ్వియుఁ గన్పట్టవు. అందుచే నామెను బరిచారిక యనవలసివచ్చినది. ఆమెయెడ సేవకు లందఱు గృహయజమానురాలివలె గౌరవముఁ జూపుచుండిరి. ఆమె యొకప్పుడు సౌందర్యవతి యని చూచినవా రనుకొందురు. ఉదయమునం దస్తమింపనున్న యర్ధచంద్రునివలె నామె తేజఃకిరణలేశమిప్పు డామెపూర్వసౌందర్యమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. గజపతివిద్యాదిగ్గజుఁ డనునతఁ డొకఁడాకోటలో వసియించుచుండెను. ఇతఁ డభిరామస్వామి శిష్యుఁడు. శాస్త్రపాండిత్యము మాట నటుంచినచో నాతఁడు హాస్యముమాటలాడి చమత్కారసంభాషణము చేయఁగలవాఁ డనిపించుకొన నిష్టము కలవాఁడు. అతఁ డొకనాఁడు విమలను "పేరిననేతితపేలా" యని పేరిడెను. "ఈపనికత్తె నేతితపేలావలె మోహాగ్నిచల్లారినకొలఁది బింకము నొందుచున్నది." అని విద్యాదిగ్గజుఁ డెగతాళిచేయుచుండెను. విమల యాతని 'రసికదాసస్వామి' యని పిలుచుచుండును.

విమల సామాన్యపరిచారికవలెఁ గన్పట్టదు. ఆమె కొన్ని సంవత్సరములు చక్రవర్తిజనానాలో నుండెడిదని పలువురందురు. విమల వితంతువో, కాదో, యెరికిఁ దెలియదు. ఆమెకడ

వితంతులక్షణములు గన్పట్టవు. పైఁగా నయిదువతనమున్నట్లే వేషభాషసంచారము లుండును.

అభిరామస్వామి వీరేంద్రునిగురువని ప్రజలు తలంతురు. అందులకుఁ దగినట్లు వీరేంద్రుఁ డాతఁడు గీచినగీటు దాటఁడు. అభిరామస్వామి తఱచు దేశసంచారముచేసి యప్పుడప్పు డీతనికడకు వచ్చి, వీరేంద్రునితో మంతన మొనరించి, జితేంద్రియుఁ డగుట లోకవృత్త మాతనికిఁ గిట్టకపోయినను, వీరేంద్రునికొఱకు బుద్ధి నుపయోగించి యాతనికి వలసినయాలోచనములఁ జెప్పి, కార్యభారము తగ్గించుచుండును.

ఒకనాఁడు వీరేంద్రునకును, అభిరామస్వామికిని రహస్యాలోచనము జరిగినది. అందుఁ బలుకారణములచే వీరేంద్రుఁడు చక్రవర్తియగు నక్బరుపక్షమూని పఠానులకష్టముల విడుగడ చేసికొనవలసినట్లు గురువు చెప్పెను. మహమ్మదీయులతో బాంధవ్య మొనరించి రాజపుత్రుల కవమానముఁ దెచ్చిన మాన సింగు క్రింద పనిచేయుటకు వీరేంద్రుఁ డంగీకరింపలేదు. అట్లయిన తిలోత్తమకు గొప్పకష్టము లోకమొగలాయియుద్యోగివలనఁ గలుగునని యభిరామస్వామి చెప్పెను. మీ కెట్లు తెలిసిన దని వీరేంద్రుఁ డడుగ జ్యోతిషమువలన నని యభిరామస్వామి ప్రత్యుత్తర మొసఁగెను. తాను మొగలాయిపక్షమున నున్న తన తనూజాతకష్టము తప్పునని విని వీరేంద్రుఁ డిట్లని యెను. "అయ్యా! నేను తిలోత్తమను చూడనంతవఱకు నామె నాతనయయే యని తలంపలేదు. ఇప్పు డన్ననో! ఆమె తక్క నాకీప్రపంచమున నెవ్వరు నగపడరు. గతమునంతయు మఱచి మానసింహునిపక్షముఁ జేరెదను." ఇంతలో నొకరా

యబారి వచ్చెను. ఆతఁడు కటక్ ఖానునివద్దనుండి వచ్చెను. ఆతఁ డొకలేఖ నిచ్చెను. అం దిట్లున్నది. "వేయిగుఱ్ఱములును, ఐదునూర్ల మొహరీలను శీఘ్రముగ నంపవలెను. లేదా మందర గడముపై నెత్తి వచ్చెదము." వీరేంద్రుఁడు యుద్ధమునకు రమ్మని బదులు చెప్పెను. రాయబారి వందన మొనర్చి పోయెను.

---

## నా ల్గ వ ప్ర క ర ణ ము.

కోటలోని యొకగదిగవాక్షములోఁ దిలోత్తమ కూరుచుండి యాఁగది నంటియున్న యామోదరానది ప్రవాహమును దిలకించుచుండెను. నది వేగముగఁ బ్రవహించుచు మర్మరధ్వనులఁ జేయుచుండెను.ఆమె మనసక్కడ లేదు. సూర్యాస్తమయ మగుచుండెను. మేఘములరంగు విచిత్రముగ నుండెను. ఆమేఘము లనదియందుఁ బ్రతిఫలించుచుండెను. నది కావలియొడ్డునఁ బెద్దపెద్దమేడలు, చెట్లు నగపడుచుండెను. కోటలో నున్న పక్షులు చెవుల కానందముగఁ గూయుచుండెను. గాలి మెల్లఁగ వీచుచుండెను. తిలోత్తమ సౌందర్యమును, బాఠక మహాశయులకుఁ బరిచయ మొనర్పఁ గుతూహల మున్నది కాని యది సులభసాధ్యము కాదు. తిలోత్తమ సౌకుమార్యము పూలయందుండు కోమలత్వమును బోలియున్నది. అది మనమనంబుల యందు నాట్యము చేయుచుండు సొగసైనయాకారము కలది. తిలోత్తమకు వయసెంతయో లేదు. పది పదునాఱేండ్ల బాలిక ఆమెను నిండుజవ్వని యనుటకు వీలులేదు. ఆమెరూపమునం దింకను కన్యాచిహ్నము లగపడుచునే యున్నవి. వంగియున్న యామె ఫాలతలము విశాలముకాని, సన్నముకాని కాకయున్నది. నిశ్చలప్రకాశమువలె శాంతిమంతము. కుంతలములు

మనోహరములుగ నున్నవి. కనుబొమలు తీర్చినట్లుండెను. ఆమె కన్ను లతివిశాలములు. శోభావంతము లగు నేత్రములు చక్కనివి. కాపట్యశూన్యములగు నాముగ్ధచూపులు హృదయ నిర్మలత నెఱుకపఱచుచుండును. ఆమెరూపము, ఆభరణములు నుండవలసినట్లుండి సౌందర్యరాశివలెఁ గన్పట్టును.

తిలోత్తమ కష్టసుఖముల యోచించుకొనుచు నచ్చటఁ గూరుచుండి యుండవలయును. ఈచిన్న వయసులో నామె కెట్టి యూహలు తట్టియుండును చెపుమా?

ఇంతలో నొకపరిచారిక దీపమును గొనితెచ్చెను. ఆలోచనలవిడిచి తిలోత్తమ యొకగ్రంథమును దీసికొని దీపముకడఁ గూరుచుండెను. అభిరామస్వామికడ నామె సంస్కృతము నభ్యసించెను. ఇప్పు డామె కాదంబరితీసికొని చదువఁదలంచెను. కాని యామె కది నచ్చలేదు. పిదప వాసవదత్తఁ గైకొనెను. ఆమె కేపుస్తకమును సంతోషము నీయలేదు. గీతగోవిందము రుచించునని తలంచెను. "ముఖర మధీరం త్యజ మంజీరం రిపుమివ కేళివిలోలమ్" అని గొణుఁగుచు పాడెను. ఇంతలో నామెకు సిగ్గువచ్చెను. ఆగ్రంథము నటనుంచి యిఃయునదియు వ్రాయఁదొడఁగెను. వెఱ్ఱిగీత లెన్నియో గీసెను. అర్థములేని మాట లెన్నియో వ్రాసెను. అవి యన్నియు మరలఁ జదువుకొనెను. ఆమె కడ కేమి వ్రాసినది? కుమారజగత్సింహా!

అది చదివి యామె సిగ్గుపడెను. వెఱ్ఱిపిల్ల! సిగ్గుపడుట కేమున్నది? అదిచూచుట కెవ్వరు నచ్చట లేరే? "కుమారజగత్సింహా! కుమారజగత్సింహా!" అని యామె రెండుమూఁడుసారులు చదివెను. దొంగతనము చేయుచున్నదానివలెఁ దలుపు

వంకఁ జూచెను. మరలఁ జూచెను. మరలఁ జదివెను, ఎవ్వారైనఁ జాతురని వ్రాసినదంతయు నామె తుడిచి వైచెను. కాని లాభము లేకపోయినది. అన్నియక్షరములును బోయినవి. కాని 'కుమారజగత్సింహ!' ఈ పేరుమాత్రము పోలేదు. ఎందు వలన?

## ఐ ద వ ప్ర క ర ణ ము.

విమల యభిరామస్వామితో నొకనాఁడు తిలోత్తమ ప్రణయవిషయమును గుఱించి మాటలాడినది. అం దభిరామ స్వామి విమలతో నేకీభవింపలేదు. తిలోత్తమ ప్రేమ మంత గాఢమైనది కా దని యాతని యభిప్రాయము. మొదట ప్రణయము కలదనుటకే సందేహించెను. తిలోత్తమ జగత్సింహునే తప్పక పెండ్లియాడు నని విమల నొక్కిచెప్పెను. వీరేంద్రసింహునకు మానసింహునిపైఁ గలయసహ్యమువలన నది సందర్భింపదనియు, మానసింహుఁడు మాత్ర మీసంబంధమున కంగీకరించునను నమ్మకమేదనియు అభిరామస్వామి పలికెను. ఇప్పుడు సంధి యగుచున్నది. కావున నభ్యంతర ముండదనియు, నంతగా మానసింహుఁ డనిష్టముగా నున్నను, తప్పక జగత్సింహుఁడే స్వతంత్రింపఁగలఁడనియు విమల పలికెను. పర్యవసానము తేలలేదు.

విమల నాఁడు సాయంకాలమునం దన గదిలోఁ జేరి యలంకరించుకొనుచుండెను. ఆమెకు ముప్పదివత్సరములు గడచినను, తల దువ్వుకొని వ్రేలుజడ వైచుకొని, నాఁడు గుడిలో జగత్సింహుఁ డొసఁగిన ముత్యాలహారమును జుట్టు

కొని, యేమేమియో చేయుచుండెను. వయసు గడచినదని వనిత లలంకారముల మానరు. కొందరు చాలసంవత్సరములు గడచిన పిమ్మటనే లావణ్యమునందలి లోపములు తీర్చుకొనుట కలంకారము లధికముగఁ గోరుదురు. విమల కొంచె మలంకరించుకొననియెడల యువతులకంటె నధికముగ లావణ్యాధిక్యముచేఁ బ్రకాశించును. ఆమె నిరంతరయౌవనముచే విరాజిల్లుచున్న దనవలసియుండును. అలంకరించుకొనుట పూర్తియైన పిమ్మట విమల త్వరితగతి తిలోత్తమ గదిలోనికి వెడలినది. ఆమె యలంకారములఁజూచి తిలోత్తమ యాశ్చర్యము నొంది యిట్లు పలికెను.

"విమలా! ఏమిది! ఈవిచిత్రాలంకారము లెందులకు; విశేషము లేమియు లేవుకద!"

"అది యంతయు నీకేల? నీకుఁ జెప్పవలసినది లేదు."

"చెప్పవా? సత్యము చెప్పుము. నీవెచ్చటి కేగెదవు?"

"నేనెచ్చటికో వెళ్లపోయెద నని నీకెవ్వరు చెప్పిరి?"

తిలోత్తమ కొంచెము కలవరమొందెను. విమల యామె తత్తరపాటును జూచి నవ్వుచు నిట్లు పలికెను.

"నేను చాలదూరప్రయాణ మొనరింపవలసియున్నది."

తిలోత్తమముఖచంద్రబింబము తేజోవంత మయ్యెను. ఆమె హస్తమును విమల పట్టుకొని కిటికీకడకుఁ దెచ్చి యిట్లనెను.

"నేఁడు నేను శైలేశ్వరుని యాలయమునకుఁ బోవుచుంటిని. అచ్చట నేనొక రాజకుమారసింహాసనితో మాటలాడవలసియున్నది."

తిలోత్తమ యొడలు జలదరించెను. ఎద్దియో మనో వికార ముదయించెను. ఆమె ప్రత్యుత్తరము చెప్పలేదు. విమల యిట్లు మాటలాడఁ దొడంగెను.

"అభిరామస్వామితో నేఁడు నేను ప్రసంగించితిని. నిన్ను జగత్సింహునని కిచ్చి పెండ్లి చేయుటకు మీతండ్రి యంగ కరించునట్లు లేదు. ఆమాటలే యాతనికడఁ దెచ్చుటకు వీలు లేదు. ఈవిషయ మిఁక నాతని చెవినిఁబడిన నేమి ముప్పు వాటిల్లునో? ఏమిశిక్ష విధించునో? ఈగండము దాఁటిన మనము ధన్యులము."

"అట్లయినచో నీవచ్చటి కేల పోయెదవు?" అని తిలో త్తమ తలవంచి యడిగెను.

"ఈదినమున నతనిఁ గలిసికొందు నని చెప్పియుండ లేదా? నేఁటికి మనమాతనిఁ గలిసికొని సరిగఁ బదునేనుదినము లైనవి మనల నాతఁ డెఱింగినంతమాత్రమున నాతనికిఁ గలుగుబాధ మేమియో నాకుఁ దెలియకున్నది. ఎట్లయినను మనసమాచార మాతనికిఁ దెలుపవలసి యున్నది. ఈసమయ మునం దాతఁ డేమిచెప్పునో చూతముగాక! నిజముగా నిన్నాతఁడు ప్రేమించి యుండినయెడల—"

ఆమె నిఁకఁ జెప్పనీయలేదు. తిలోత్తమ చీరచెఱఁగున నామెనోరు మూసివైచి "విమలా! ఏమిమాట లివి! సిగ్గు! సిగ్గు! నీయిష్టమైనచోటికి నీవు పోయిన పోవచ్చును. కాని నా విషయ మెవరికడ నెత్తకుము. ఒకరిమాట నీకడఁ దెచ్చుటఁ గూడ ననవసరము." అనెను. విమల కీచేష్టలవలనఁ గడుపుబ్బ

నవ్వువచ్చెను. "నీవు బాలికవు. అయ్యో! నిన్నీమహాసముద్ర మున మునుఁగు మని యెవ్వ రనఁగలరు?"

"పొమ్ము! ఇఁక నీమాటలు నేను వినను."

"అయిన నేను గుడికడకుఁ బోను."

"నిన్ను నేను కట్టుకొంటినా? ఇష్టమైనచోటికిఁ బోవు టకు నాయభ్యంతర మేమున్నది? పొమ్ము!"

"అట్లయినచో నేను వెళ్లనే వెళ్లను." అని విమల నవ్వెను.

తిలోత్తమ తల వంచుకొని "వెళ్లుము!" అనెను. విమ లకు మరల నవ్వు వచ్చెను. కొంచెమునే పూరకుండి "నేను వెళ్లెదనుకాని, నేను మరల వచ్చువఱకు నిద్రింపకుము." అనెను. తిలోత్తమవదనమున హాసరేఖ యుదయించెను. ఆ చిఱునవ్వునందు "నేను మాత్ర మెట్లు నిద్రపోఁ గలను?"అను నట్లుండెను. విమల యాయర్థమును సులభముగ గ్రహించెను. ప్రయాణమునకు సిద్ధముగ నుండెను. తిలోత్తమ భుజములపై జేయివైచి యామెచుబుకమును బట్టుకొని యొక్కమా ఱామె వంకఁ జూచెను. ప్రేమ ముట్టిపడ నామెను ముద్దుపెట్టుకొనెను. తిలోత్తమకన్నుల నీరు గ్రమ్మెను. ఇంతలో నాష్మానీ గదితలుపు కడకు వచ్చి "విమలా! ప్రభువువారి సెలవయినది." అని పలికెను.

తిలోత్తమ యామాటవిని "నీ వీ వేషమును దీసివైచి మఱి తండ్రికడకుఁ బొమ్ము!" అని చెప్పెను. విమల "భయము లేదులే అమ్మా!" అని చెప్పి వీరేంద్రసింహుని పడకగదిలోనికిఁ బోయెను.

వీరేంద్రుఁడు పరుండియుండెను. పరిచారిక యొకతె కాళ్లు పట్టుచుండెను. మఱియొకరితె విసరుచుండెను. విమల పానుపుకడ కేగి "ఏమి యాజ్ఞ?" అని యడిగెను. వీరేంద్రుఁ డామెను తలయెత్తి చూచి "విమలా! నీవేదైన పనిమీఁదఁ బోవుచుంటివా?"

"చిత్తము! దేవరవారియాజ్ఞ యేమి?"

"తిలోత్తమ శరీరారోగ్యము చక్కఁబడినదా?"

"ఆహా!"

"విమలా! కొంచెము విసరెదవా? ఆస్మానీ పోయి తిలోత్తమను దెచ్చును."

అచ్చట నున్న పరిచారికల నందఱ నాపని యీపని చెప్పి యావలకుఁ బంపివేసిరి. ఆస్మానీ నావల వేచియుండు మని విమల సైగ చేసెను.

"విమలా! ఈదినమున నీవేష మెందులకు?"

విమల వీరేంద్రునిపై మోహంపుఁ జూడ్కులఁ బఱపి "నేను జారిణిని గదా! నేనిప్పు డొకచోటికిఁ బోవలయును." అని చెప్పుచు నామె తత్క్షణమే యటనుండి వెడలిపోయెను.

---

## ఆఱవ ప్రకరణము.

విమలసైగ ననుసరించి యాస్మానీ బయట నిలువఁబడి యుండెను. తనతో సహాయముగ నేరినైనఁ దీసికొని పోవలయు నని విమల యాలోచించినది. అందుల కాస్మాని తగిన దని నిర్ణయించుకొనినది. కాని యాస్మానీని జగత్సింగెఱుఁ

గును. ఈమె యొకమహామ్మదీయవితంతువు. ప్రబంధకవుల యుత్ప్రేక్షోక్తులకుఁ దగినసౌందర్యము కలది. ఆతఁడామె నానవాలు పట్టఁగలఁడేమోయని విమల సందియమొందినది. ఆష్మానీకూడ రాకొమరునిఁజూడవలయు నని కోరిక గలదయ్యె. కార్యము చెడిపోవునని యాష్మానీ విమలను వెంబడించుట మానుకొనెను మఱి యెవ్వరినిఁ దీసికొనివెళ్లిన బాగుగ నుండు నని వా రుభయులు నాలోచించిరి. ఇంతలో నాష్మానీ తనలో నవ్వుకొనుచు, మీరసికానందస్వామి నేల తీసికొనిపోఁగూడ దని యడిగెను. "గ్రుడ్డికన్ను తెఱచినను మూసిన నొకటియే" యని వారామందునిఁ దీసికొనిపోవచ్చునని నిశ్చయించుకొనిరి. అంతట నాష్మానీవిమలలు విద్యాదిగ్గజునికడకుఁ బోయిరి. ఆ మూఢుని మోహపుఁబలుకుల నాస పెట్టి వారిరువురును కృత కృత్యులైరి. విమల విద్యాదిగ్గజునితో బయలువెడలెను. ఆతఁడు మిక్కిలి పిఱికివాఁడు. అనేకకష్టములు పెట్టి, భయము నొందుచు, జయ్యములను పెఱచుచు, విద్యాదిగ్గజుఁడు విమ లను గుడిసమీపమున విడిచి పాఱిపోయెను. ఆమె 'రాకొమ రుఁడు వచ్చునో రాఁడో' యని సందేహించుచు నాఁడు నాఁడు "పదునేనవదినమునఁ గలసి కొననియెడల నిఁక మన మెన్నఁడును గలసికొన" మని చెప్పెనుకాని తప్పక వచ్చెద నని చెప్పలేదని చింతించుచు, అతఁడు నిశ్చయముగ రాని యెడలఁ దానెట్లు తిరిగి కోట కొంటరిగఁ బోవుదు నని కలవర పడుచు గుడికడకుఁబోయెను. ఆమె భయముతో గుడిమెట్ల కడకుఁబోయి తలుపుత్రోసెను. తలుపు వీడలేదు. "ఎవరక్కడ!" అని యామె కేకవైచెను. ధనురాకారమున వంగియున్న

గుడియుపరిభాగమునుండి "ఎవరక్కడ ?" అను ప్రతిధ్వనివినc బడెను. విమలధైర్యమును దెచ్చుకొని యిట్లు పలికెను.

"మార్గాయాసము నొందిన యొకయబలను."

తలుపువీడినది. లోన దీపము కాంతిమంతముగ వెలుcగు చున్నది. ఆమెయెదుటc బొడవైనయొకమనుజుcడు నిలువc బడియుండెను. అతని చేతిలో నొక యొరతోcగూడిన కత్తి యున్నది. విమల యాతనిcజూచెను. ఆనవాలుపట్టెను. వా రెవరు?

కుమారరాజా జగత్సింహుcడే!

## ఏడవ ప్రకరణము.

విశ్రాంతికై విమల కూరుచుండెను. శైలేశ్వరునకు జగత్సింహునకును నమస్కరించెను. చాలసేపటివఱకు నెవ్వరును మాటలాడలేదు. ఒకరిభావము లొకరి కెఱుకపఱచుట యెట్లో వారెఱుcగక ముగ్ధులై యుండిరి. ఇరువు రేమియుc దోcపక కలవరపడిరి. ఏవిధముగా మాటలాడవలయును? ఎవరు, ఏమని, ముందుగా సంభాషణ మారంభింపవలయును? ఇట్టిసంగతులలో విమల పరిపూర్ణప్రజ్ఞతోc బ్రవర్తింపcగలదు. ఈసంభాషణ మారంభింపcగలదు. అవసరమైన నూరకుండcగలదు. చిఱునగవుతో నామె యిట్లు ప్రారంభించినది.

"ఈశైలేశ్వరునికరుణవలన మరల మీదర్శన మైనది. నడిరాత్రియం దిటకు వచ్చుటకు మిగుల భయము కలిగినది. మీదర్శన మైన పిమ్మట మరల ధైర్యము కలిగినది."

"మీరెల్లరు క్షేమమా?"

తిలోత్తమయందు జగత్సింహుఁడు నిజముగఁ బ్రేమ కలిగియుండెనో లేదో ముందు తెలిసికొని పిమ్మట కొదువ విషయములను ముచ్చటింపవలయు నని తలఁచి విమల మరల నిట్లుపలికెను.

"చిత్తము. మీసుఖముకొఱకే శైలేశ్వరునిఁ బూజింప నిటకు వచ్చితిని. కాని మీర లొనర్చినపూజలకు దైవము ప్రీతుఁడైనాఁడు. ఇఁక మాపూజ లాయన కెందులకు? కావున సెలవైన మరలి పోయెదను."

"మంచిది. నీవొక్కతెవు పోలేవు. నేను నీకు సాయము వచ్చెదను."

జగత్సింగు కేవలము యుద్ధకార్యములయందే నిమగ్నుఁడై యుండలేదని విమల తెలిసికొనెను.

"నేనొక్కతెను పోలేనా? ఏల?"

"దారిలో నేదైన నుపద్రవము కలుగవచ్చును."

"అట్లు కలిగినచో మానసింహమహారాజుకడకే పోయెదను."

"ఎందులకని?"

"మీరు నియమించిన సేనాధిపతి రాష్ట్రమునందలి ప్రజలకుఁగలుగు నుపద్రవములఁ దీర్పలేకున్నాఁడు. శత్రువుల నాశన మొనరింప నాతనికడ శక్తిలేదు. అని మహారాజుతో జెప్పుకొందును."

"శత్రువుల నిర్మూలన మొనర్ప భగవంతునికైన శక్తి లేదు. ఇఁక మానవుఁ డెంత? ఇటు చూడుము. ఈశ్వరుఁడు

మన్మథునిఁ దనకోపాగ్నిచే మూఁడవనేత్రమును దెఱచి భస్మ మొనరించెనుకదా! పదునేనుదినములక్రిత మీయాలయమునఁ దనసమీపమునందే మన్మథుఁ డొనరించిన యద్భుత పరాక్రమ ప్రదర్శనములఁ జూచియు నూరకుండెనే? ఆకలవరమాతఁ డాపినాఁడా? ఈశ్వరుని పరాక్రమ మింతే! ఇఁక మానవులెంత? అని సైన్యాధిపతి సమాధానము చెప్పఁ కొనును."

"ఎవరనిఁ గలవర మొందించెను మన్మథుఁడు." అని చిఱునగవుతో విమల యడిగెను.

"సేనాధిపతినే"

"ఏమిది? మహారాజీయసాధ్యకార్యమును విని నమ్మునా?"

"నాకు మంచిసాక్షు లున్నారు."

"వా రెవరు?"

"సుహృదయ వగునీవు"

"మీ యీ పరిచారిక మంచిహృదయముకలది కాదు. ఇఁక నన్ను మీరు 'విమలా' యని పిలువవచ్చును."

"నా మొదటిసాక్షి విమల!"

"కానేరదు. విమల యెప్పుడు నిట్టిసాక్ష్యమునకు సంపన్నములకుఁ బోయి యెఱుఁగదు."

"అయి యుండవచ్చును. కాని పదునేనుదినములలోఁ దాను వాగ్దాన మొనరించినసంగతులను మఱచిపోవునది సాక్ష్య మెట్లిచ్చును?"

"నేను వాగ్దాన మొనరించితినా? ఏమని?"

"మీ చెలియపేరును, వంశమును, వాసస్థలము నెఱేఁగింతునని నీవు వాగ్దాన మొనరించి యుండలేదా?"

విమలకంఠస్వర మట్టి మార్పునొందెను.

"రాకుమారా! ఆవివరములు మీకడఁ జెప్పుటకు సందియమొందుచున్నాను. ఆమెసంగతి నెఱేఁగించిన మీకు సంతాపమొదవించినదాన నగుదు నని తలంచుచున్నాను."

రాజపుత్త్రుఁ డించుక యోచించెను. పరిహాసము విడిచి యిట్లు పలికెను.

"ఆమెవృత్తాంతము నెఱుకపఱచుటవలన నాకు నిజముగ నసౌఖ్య మగుననియే తలంచితివా?"

"ఔను."

జగత్సింగు మరలఁ గొంచెమునే పాలోచించి యి ట్లని యెను.

"ఏమి కానున్నదో కానిమ్ము. నాకోర్కె చెల్లింపుము. ఆమె వివరములే తెలియకపోవుటచే నేను మఱేంత దుఃఖపడుచున్నాను. ఆపరితాపమునకు మేరలేదు. ఈపరితాపముకంటె నాకు సిలుగులుండఁ బోవు. నీవు తలంచినట్లు సత్యముగ నాకుఁ బరితాపమే కలుగునని తలంచుము. కాని యిది నాయిప్పటి వేదనకంటె నధికముగ నుండదు. ఉండనిమ్ము! నేనది సహించెదను. ముందీ పరితాపమును జల్లార్పుము. విమలా! నేను వినోదముగ నిట రాలేదు. అట్టి వినోదవిహారముల కిప్పుడు నాకవకాశము లేదు. ఈ పదునేనుదినములనుండియు గుఱ్ఱపువీఁపే నాకు శయ్యాగారముగఁ దిరిగితిని. నాహృదయమునకు విశ్రాంతి లేదు. నీకొఱకే ప్రయత్నించుచున్నాను."

ఆతనిహృదయమును బరికించుటకే విమల యింతవఱకు నీవిధము మాటలాడినది. ఆమెకు వలసినవిషయములు వచ్చినవి. ఆమెకోరిక తీరినది. ఇంకను నాతని హృదయము నెఱుఁగదలఁచి యామె యి ట్లనెను.

"రాకుమారా! నీవు రాజనీతికోవిదుఁడవు కదా ! ఇట్టి యాందోళన దినములయందు, యీయుద్ధసమయమునందు నీకు దుర్లభమైనయువతికొఱ కిట్లు పరితాప మందుచు కుందు చుందువా ? నీవామెను మఱవఁ గలిగినచో నిరువురకును శ్రేయస్కరము. నీకాయుద్ధమున జయ మగును."

"ఏమి? ఆఁ! ఎవరిని? మఱవఁ గలుగుట!" ఆతని పెదవి పై మనోవ్యాకులమును సూచించుభావగర్భితమైన చిఱునవ్వు మొలచెను. "ఆఁ! ఏమి? ఎవరిని? మఱవఁగలుగుట? మీసఖి సుందరాకారము, మొదట చూడఁగనే, నాహృదయమున మల చినట్లు స్థిరముగ నాఁటుకొనెను. ఈశరీరము భస్మమైనను ఆరూ పము పోదు. ఆరూప మప్పటికిని నాహృదయమున నే విడువక యుండఁగలదు. ప్రజలు నన్ను ఱాతిగుండె కలవాఁడని చెప్పు కొందురు. ఱాతిమీఁదఁ జెక్కినవిగ్రహ మాఱాయి భగ్నమైన ప్పుడు తక్క నశించునా ? ఇది నీవెఱుంగవా? యుద్ధమును గుఱించి యేదియో చెప్పితివి. నా సొగసుకత్తెను జూచినప్పటి నుండియు యుద్ధమునందే యున్నాను. యుద్ధరంగమునం దున్నను, ఇంటికడ నున్నను నాకాసౌందర్యరాశి ముఖవికాస మొకత్రుటికాలమైన మఱపు వచ్చుటలేదు. పఠానుఁ డెవ్వఁ డైన ద్వంద్వయుద్ధమునందో, వెనుకబాటుననో, నన్ను నఱక ఖడ్గము నెత్తినప్పు డెల్ల నాకు ముందు జ్ఞప్తికివచ్చురూపము

మీచెలియదే! "అయ్యో! ఇట నే వీరమరణము నందిన నిఁక నాసౌందర్యరాశి వదనప్రకాశమును జూడఁ జాలను కదా! మొదటి చూపే కడపటి దగుచున్నదే! అని పరితపించెడువాఁడను. విమలా! చెప్పవా? మీచెలియను నేనెక్కడఁ జూడఁ గలను?"

విమల సందియము తీరిపోయినది. ఆమె కాతనిహృదయము నెఱుఁగవలసినయవసర మిఁక నేమి కలదు? ఆమె జనత్సింహునితో నిట్లనియెను. 'నీ వాసుందరిని మందరగడముగఁ జూడఁగలవు. ఆపెనామము తిలోత్తమ! ఆమె వీరేంద్రసింహుని తనుజాత."

జగత్సింహునకుఁ బాము కఱచినట్లయ్యెను. శిరమువంచి కత్తిపై నాఁకఁగి నిట్టూర్పువిడిచి కొంతసేపటికి 'విమలా! నీవన్న మాట సత్యమైనది. తిలోత్తమ నాతిలోత్తమ కానేరదు. రణమునకు వెడలెదను. నాముందు జీవితమునందుఁ గలుగునను కొనిన కలలయందలి సుఖముల కొఱకుఁ బొందిన యాశాపంకమును శత్రువులరక్తమునఁ గడగి సుఖము నొందెదను.' అని జగత్సింహుఁడు విచారముతోఁ బలికెను.

విమలయుఁ జాల దుఃఖించెను. "రాకుమారా! సృష్టియందు నిజమైనయనురాగమునకే జయమీవఱకు సిద్ధించియుండినయెడల నీవును నీప్రయత్నములయందు జయ మొందఁ గలవు. ఇంతలోనే నిరాశ నొందనేల? అదృష్ట మిట్టిదని నిర్ణయింపఁజాలము. అది నేఁడు ప్రతికూలముగ నుండినను, తేపను కూలముగ నుండవచ్చును." అనియెను.

ఆశను గలిగించువాక్యములు మధురవంతములు. ఆశాదేవి మానవునికి మహాంధకారమువలె నున్న దుర్దినమున నాతనిచెవిలో నెద్దియో రహస్యముగ తీయనిమాటలతోఁ జెప్పును. 'మీరంతగా దుఃఖింపనేల? నామనవి వినుఁడు. గాలియు వానయు శాశ్వతముగ నుండునా?' అని యాశాదేవి విమలయై వాక్రుచ్చెను. జగత్సింహున కామాటలు వినఁబడినవి. ఈశ్వరోద్దేశ మెవ రిట్టిదని చెప్పఁగలరు? ఊహింపఁగలరు? ప్రపంచమునం దసాధ్యకార్య మున్న ట్లగపడదు. ఎన్ని యసాధ్యకార్యము లనుకొనినవి సుసాధ్యము లగుట లేదు? జగత్సింహుఁ డిట్లే ఆశాబద్ధుఁడై పోయెను. ఈప్రకారము చెప్పం దొడంగెను. "విమలా! నేఁడు నామనస్సు నిలుకడగ లేదు. ఏమిచేయుటకును దోఁచుట లేదు. కర్మసూత్రము నడిపింపఁగలదు. అది విధాయకము. దాని నెవ్వరు మీఱఁగలరు? మనసున నున్నది చెప్పుచున్నాను. ఈశైలేశ్వరునిసమీపమున దేవాలయమునందు నుడువుచున్నాను. విమలా! తిలోత్తమనే పెండ్లియాడుదును. ఆమెనువిడిచి మఱియొకతె నెట్టిదానినైన పెండ్లియాడఁ దలంపలేదు. విమలా! ఈనామాటలన్నియుమాత్రము మీచెలియతో విన్నవింపుము. ఆమె నిఁక నొక్కసారి చూడవలయునని చాలకోరిక కలదు. ఇఁక నెన్నఁడు నట్టికోరిక కవకాశము లేదుకదా!"

విమల సంతోషముచే నుప్పొంగుచు "మాసఖి చెప్పిన మాటలు మీకుఁ జేరుట యెట్లు?" అనెను. "నిన్ను మరల శ్రమపఱచుటకు నాకు సాహసము కలుగుచున్నది. అట్లయ్యు నాకొఱ కింకొకమాటీదేవాలయము మరల శ్రమ యని

యెంచక కలిసికొంటివా నేను నీఋణమున నుందును. సమయము వచ్చినప్పు డీఋణమును జగత్సింహుండు తీర్పక యుండఁడు."

"రాజకుమారా! నేను నీపరిచారికను న న్నిన్నివిధముల బ్రతిమాలుకొన నగత్యము లేదు. రాత్రులయం దీదారిని వచ్చుటకు నాకు భయ మగుచున్నది. నావాగ్దానమును జెల్లింప లేకపోవుదు నేమో యనుభయముచేత నీయర్ధరాత్రమునందు సాహసించి రావలసివచ్చినది. దేశమునందు శత్రువులయలజడు లత్యధికముగ నున్నయీదినములలో నేను మరల రాలేను."

కొంచె మాలోచించి జగత్సిం గిట్లనియెను. "విమలా! ఒక్కమాట చెప్పెదను. నీకుఁ దప్పుగా నుండనిచో నేను నీవెంట మందరగడమునకు వచ్చెదను. వచ్చి యనువైనప్రదేశమునందు రహస్యముగ దాఁగియుందును. అక్కడకు వచ్చి మీసఖివృత్తాంతము నామె యభిప్రాయమును నాకెఱిఁగింప లేవా?"

'అట్లయినచో నాతో రమ్ము' అని విమల సంతోషముతో ననెను.

వారిరువురు నాలయమునుండి మందరగడమునకుఁ బోవ సుద్యుక్తులైరి. ఇంతలో దేవాలయమున కావలప్రక్క నెవ్వరో మెల్లఁగ నడచినట్లలుకుఁ డయ్యెను. ఆయడుగుల ధ్వనివలన వా రనుమానము నొందిరి. జగత్సింహుఁ డింతలో విమల నిటడిగెను.

"నీవెవరినైన వెంటఁ దీసికొని వచ్చితివా?"

"లేదు"

"అట్లయినచో మనమిప్పుడు వినినయడుగులధ్వని యేది? మన ప్రసంగ మావలనుండి యేరును వినలేదు కద!" అనుచు నతఁడీవలకువచ్చి యాలయముచుట్టును దిరిగి చూచెను. ఎవ్వరు నగపడలేదు.

## ఎ ని మి ద వ ప్ర క ర ణ ము.

శైలేశ్వరునకు నమస్కరించి వారిరువురును మందరగడమునకుఁ బ్రయాణమైరి. కడువేగముగ నడుచుచుండిరి. ఇరువురును మాటలాడుట లేదు. కొంతవడికి రాజిట్లు నుడివెను.

"విమలా! నాకొక విషయమునుగుఱించి మిక్కిలి యక్కజ మగుచున్నది. అది విని నీవేమి ప్రత్యుత్తర మిచ్చెదవో నాకుఁ దెలియకున్నది."

"ఏవిషయము?"

"నీవు సేవకురాలవు కావని నాయభిప్రాయము."

"అట్లనుచుంటి రెందువలన?" అని విమల చిఱునవ్వుతో నడిగెను.

"వీరేంద్రసింహునితనూజాత అంబరుప్రభుపుకోడలు కాకపోవుటకుఁ బ్రత్యేకకారణ మొకటి కన్పట్టుచున్నది. అది మిగుల రహస్యమైనది. కేవలము పరిచారికవే యైనచో నా కారణమును నీవెఱుంగఁజాలవు." విమల నిట్టూర్పు నొకటి విడిచెను.

"కుమారా! సత్యమును గ్రహించితివి. నేను పరిచారికను గానను మాట సత్యమే! అట్లయ్యు నాదురదృష్టవశమున నట్లు ప్రవర్తింపవలసి వచ్చినది. అదృష్టమును నిందింపనేల? అది యంతకఠినమైనది కాదు." అని విచారముతో బదులు పలికెను.

ఈప్రసంగ మామెకు దుఃఖజనక మని జగత్సింగు గ్రహించెను. ఆమాటలు మానివేయ నూహించుచుండెను.

"రాకుమారా! ఇప్పుడు కాకపోయిన నింకొకప్పుడైన నావృత్తాంతమును మీకుఁ దెలుపక తప్పునా? కాని యాధ్వని యేమి? మనల నెవ్వరైన వెంబడించుచున్నారా?"

మనుష్యుల యడుగులధ్వనులును, ఇరువురు మనుజులు గుసగుస లాడుకొనుధ్వనియు వారికి స్పష్టముగ వినఁబడెను. వారికి సందేహము కలిగెను. వా రొక యర్ధక్రోశముదూరము నడిచిరి. జగత్సింగు నిలిచి "విమలా! నాకు చాలననుమానము కలుగుచున్నది. చూచివచ్చెద నిటనిలుపఁబడుము." అని చెప్పి కత్తి దూసికొని కొంచెము వెనుకకు మఱలిచూచెను. ఎవ్వరు నగపడలేదు. చుట్టుప్రక్కల బాగుగఁ బరిశీలించెను. ఏమియు ననుమానింపఁదగిన దగపడలేదు. మరల వచ్చి విమలతో జగత్సింహుఁ డిట్లనియెను. "ఎవ్వండో దుర్మార్గుఁడు మనలవెంబడించుచున్నట్లే యున్నది. ఏమైనను నీవు మెల్లఁగ మాటలాడుము." అనెను. వారు నడుచుచుండిరి.

పరులకు వినఁబడకుండ మెల్లఁగ మాటలాడుకొనుచు నిద్దఱును గోటకడకుఁ జేరిరి.

"నీ విప్పుడు కోటలోని కెట్లు పోయెదవు? అర్ధరాత్రము కదా! ద్వారము బంధించి యుండదా?"

"నే నవలకు వచ్చునప్పుడు నేను తగినయేర్పాటు లొనరించుకొనియే వచ్చినాను."

"గూఢమార్గ మేదైన నున్నదా?".

"దొంగకుఁ గన్నము లుండవా?"

"విమలా! నే నీకముందున కేల రావలెను. ఈచేరువ నున్న యామామిడితోఁటలో నుందును. తిలోత్తమతో నా మాటలుగ నిట్లు నుడువుము."

"నిన్నొకసారి చూడవలయు నని కోరిక యధికముగనున్నది. నాకన్నుల కట్టిభాగ్య మొదవింపఁ బ్రార్థించుచున్నాఁడను. అది యిప్పుడైనను సరియే! మరి పదునేనుదినములకైన సరియే! కాకుండిన నొకమాసమునకైనను సరియే! తుదకొక వత్సరమైన కనుపెట్టుకొని యుందును."

"ఈకోట యంత రహస్యమైనది కాదు. నాతోఁగూడ రమ్ము!"

"ఇఁక నెచ్చటకు?"

"కోటలోనికి"

జగత్సింగు కొంచె మాలోచించెను.

"విమలా! నే నట్లొనర్పఁజాలను. దుర్గాధిపతి యనుమతి లేకుండ నేను కోటలోనికి రాను."

"నీకంతభయమునకు కారణ మేమున్నది."

"క్షత్రియజన్ముల కట్టిభయ మవసరము లేదు. వారు భయమెఱుంగరు. నీవు సేవకురాలవు. నన్ను కోటలోనికిc దీసి కొనిపోవుటకు నీకధికారము లేదు."

"నాకట్టియధికార మున్నది. అది నీకు విశ్వాసార్హ్యముగ నుండిననే నీవు రావచ్చును."

"అట్లయిన నది యేది?"

విమల రహస్యముగ నెద్దియో చెప్పెను. జగత్సింగాశ్చర్యము నొంది—

"అమ్మా! దయచేసి నడువుము. నేనును నీవెంట వచ్చెదను."

"నీవ ట్లనcగూడదు. నాకాజ్ఞాపింపవలసినవాcడవు."

"నీయిష్టమువచ్చినట్లే చేసెదను."

వారు నడచుచున్న త్రోవ కోటగుమ్మముకడకుc బోవును. ఆప్రక్కనే మామిడితోcట కలదు. ప్రధానద్వారముకడ కది బాగుగ నగపడును. ఆమోదరానదికడకుc బోవలసినవారీతోటదారినే పోవలయును. విమల దారిని విడిచి తోcటలోc బ్రవేశించెను. రాజామెను వెంబడించుచుండెను.

వారందుc బ్రవేశించినతోడనే రాలిన యెండుటాకులపై నెవ్వరో నడచినధ్వని మరల వినcబడెను. విమల "అదిగో! మరల నాశబ్దము" అని రాజుతోc బలికెను.

'నీ విచ్చటc గొంచె మాcగుము. నేను పోయి చూచి వచ్చెదను.' అని చెప్పుచు జగత్సింహుcడొఱనుండి కత్తిని లాగి ధ్వని వినcబడిన మార్గమునుబట్టి వెడలెను. ఎవ్వరు నగ

పడలేదు. ఆమామిడితోఁటయం దడుగుభాగ మంతయు నడవి మొక్కలపొదలతో నిండియుండెను. మఱియు చెట్లనీడచే నట గాఢాంధకారము వ్యాపించి యుండెను. ఏమియు నగపడుట లేదు. ఏమృగములో నడచుటచేనైన నీధ్వని కలుగఁగూడదా? ఎట్లయిన నేమి? సందేహముండఁగూడ దని నిశ్చయించుకొని జగత్సింహుఁ డొకచెట్టుకొమ్మపై కెక్కి నలుప్రక్కల పరీక్షించెను. చాలసేపటికి నిరువురుమనుష్యు లగుపడిరి. వారిశిరముల పైని తెల్లనితలపాగలు వెన్నెలలో మెఱయుచుండెను. వారొక చెట్టునీడయందు దాఁగియుండిరి.

జగత్సింహుఁడు వారున్నచోటును బాగుగ గుర్తించెను. ఇద్దరున్నారని స్పష్టముగఁ దెలిసికొనెను. ఆచెట్టును గూడ బాగుగ గుర్తుపెట్టుకొనెను. మెల్లఁగ దిగి విమలయున్న చోటకు వచ్చి తాను కనుపట్టిన విషయముల నెల్ల పూస గ్రుచ్చినట్లు చెప్పి "ఇప్పు డెక్కడైన రెండుబల్లెములు దొరుకునా?" అని యడిగెను.

"బల్లెము లుండిన లాభమేమి?" అని విమల యడిగెను.

'వారెవరో బాగుగ గుర్తించెదను. వారి తలపాగలను బట్టిచూడ వారు పఠానులవలె నగపడుచున్నారు. వారేదో చెడ్డయుద్దేశముతోడనే మనలను వెంబడించి యుందురు.'

'మీరిట నుండుఁడు. నాకును జ్ఞప్తికివచ్చినది. నేను దేవాలయమునకు వచ్చుచున్నప్పుడు దారిలో నాకొక మరణించినయశ్వమును యోధుఁడును గాన్పించెను. వారు తప్పక పఠానులచే గాయములంది యుందురు. ఇప్పుడే బల్లెములఁ గొని వచ్చెదను.' అనిచెప్పి విమల కోటదగ్గఱకుఁ బోయెను. ఆమె దేవాలయమునకుఁ

బయలు వెడలుటకు ముందలంకరించుకొనిన గదికిటికీ యీ తోఁట కెదురుగ నున్నది. ఆమె యాగవాక్షమును జేరి తన కడనున్న తాళముచెవితో నాకిటికీ తాళమును దీసెను. పిదప గొళ్లెమును బట్టుకొని యాతలుపును ద్రోసెను. తలుపు గోడ లోని కిమిడి పోయినది. మార్గ మేర్పడినది. విమల గదిలోనికిఁ బ్రవేశించెను. తలుపు మరల లాగి తాళమువైచి లాగి చూచెను. ఇఁక నవ్వలివారి కాతలుపు రాదని నిశ్చయించు కొని లోపలకుఁ బోయెను.

త్వరగ నడచి యాయుధశాలకుఁ బోయి రక్షకుని బిలిచి యిట్లు చెప్పెను. 'నాకు రెండుబల్లెములు కావలసియున్నవి. ఇమ్ము. మరలఁదెచ్చి యవి నీకిచ్చెదను. ఇ ట్లడిగి బల్లెములఁ దీసి కొంటి నని యేరితోడను జెప్పకుము.'

'అమ్మా! మీకు బల్లెము లిప్పు డెందులకు?'

'ఈదినమున వీరపంచమీవ్రత మొనరించెదను. వనితలు శూరవంతు లగుపుత్రులఁ బడయుట వ్రత మొనరించెదరు. నేఁడు నేనట్టి వ్రతమును జేయుచున్నాను. నా కట్టిపుత్రుఁడు పుట్టవలెనని కోరిక కలదు. ఈసంగతి నితరులకుఁ దెలియనీయ కుము.'

ఆయుధశాలాధికారికిఁ దెలిసినంత దెలిసినది. ఆకోట లోని భృత్యులందఱు నామెకు భయము నొందువారే! ఈతఁ డును మాఱుపల్కక రెండువాఁడిబల్లెములఁ దెచ్చి యామె కిచ్చెను.

విమల మునుపటివలెనే గవాక్షమును దెఱచి జగత్సిం హునికడకుఁ బోయెను. మరలఁ దలుపును దొందరలో మూయ

లేదు. ఇది యపాయమునకు దారిచూపుటయే? గవాక్షమునకు మిక్కిలి సమీపముననే యొకమనుజుఁడు చీఁకటిలోఁ బొంచి యిదియంతయుఁ జూచెను. విమల కనుచూపుమేర పోవువఱ కాతఁడు కదలక యుండెను. పిదప నతఁడక్కడ చెప్పులను విడిచి కిటికీకి సమీపించెను. లోపల నెవ్వరైన నుందురని పరికించెను. అలుకుడైన లేదు. గది తలుపుతీసి కోటలోనికిఁ బ్రవేశించెను.

ఇట జగత్సింహుఁడు విమల తెచ్చినయాయుధముల గైకొని యెప్పటివలెఁ జెట్టుకొమ్మపై కెక్కెను. తాను మొదట నానవాలుంచుకొనిన వృక్షమువంకఁ దిలకించెను. అక్కడ నిప్పుడిరువురు లేరు. ఒక్క తలపాగయే కనఁబడుచుండెను. రెండు చేతులుతో రెండుబల్లెములఁ బట్టుకొని యాతలపాగపై పునకుఁ జూచి గుఱిచూచి శక్తికొలఁది విసరివైచెను. ఎండుటాకులు ధ్వని గలగలమని వినఁబడెను. అక్కడ నిఁక పాగకనఁబడలేదు. జగత్సింగునిగుఱి తప్పునా? అతఁడు మరణించె నని తెలిసికొని మఱి దిగెను.

జగత్సింగు వేగముగ వృక్షము దిగి యామనుష్యునికడకరుదెంచెను. ఆతఁడు శస్త్రధారియగు మహమ్మదీయసైనికుఁడు, చచ్చినట్లు పడియుండెను. బల్లెము పాప మాతనికంటిలో దిగినది. రాజు పరిశీలించిచూచెను. ఆమహమ్మదీయుఁడు మరణించి యుండెను. ఆయుధ మాతనికంటిలోనే కాదు మెదడులోనికిఁ గూడఁ బోయినది. ఆతని చొక్కాయిలో నొకకాగిత మున్నది. జగత్సింగు దానిని తీసికొని వెన్నెలలోనికి వచ్చి యిట్లు చదివెను.

"కటులూఖానుని భృత్యులం బఱునుదీనినిఁ
జూచినవెంటనే దీనినిఁ దీసికొనివచ్చిన
వాని యిష్టముల ననుసరింపవలెను.
కటులూఖాను."

విమల యామాటలను వినినది. కాని దానియర్థము బోధపడలేదు. జగత్సింగు విమలతో నంతయు వివరముగ నెఱుఁగఁజెప్పెను.

'అయ్యయ్యో! ఈవిషయము నీకాయుధములు తెచ్చి నప్పుడు తెలియకపోయినది కదా! తెలిసియుండినచో నీకా బల్లెములఁ దెచ్చి యిచ్చుదాననా? నేనెంతపాపిని! ఈరాత్రి నేనొనర్చిన ఘోరములకుఁ బరిహారము చిరకాలమువఱకుఁ జేయఁజాలను.'

'ఇందింత విచారించుట కవకాశ మేమి యున్నది? చచ్చినవాఁ డరిమండలిలోనివాఁడు కదా! ఇం దపచార మున్నదా?'

'శూరుల కట్లే యుండును. మే మబలలము కదా!'

విమల కొంచెము యోజించి 'రాకుమారా! ఇఁక నిట నుండుట యపాయకరము. కోటలోనికిఁ బోవుదము రమ్ము. తలుపు తెఱచి వచ్చితిని' అనెను.

ఇద్దఱును వడివడి నడచి కోటలోఁ బ్రవేశించిరి. లోపలఁ బ్రవేశించునప్పటికి జగత్సింగుహృదయ మించుక చలించెను. కాళ్లు కంపమొందసాగెను. మహాసైన్యముల నెదురింపఁబోయి నప్పుడైన నాతని శిరోజముకూడఁ జెక్కుచెదరలేదు; అట్టి

దీసంతోషసమయమున నీవిపరీత మేమి ? ముందేమి కానున్నదో ?

విమల మరల నెప్పటియట్ల కిటికీతలుపు మూసి రాజపుత్రునితోఁ బడకగదిలోనికి బ్రవేశించెను.

'రాకుమారా! నేనొక్కనిమిషములో మరల వచ్చెదను. దయచేసి యీపాన్పుపైఁ గూరుచుండుము. మీకు భేదభావ ముదయింపకుండ నీశ్వరుఁడు వటపత్రశాయియే యని తలంచుకొనుఁడు.' విమల యవ్వల కేగెను. కొంతసేపటి కాగదిలో నున్న యింకొకగది తలుపుతీయఁబడెను. లోపలినుండి 'రాకుమారా! ఇటు రండు! ఒక్క మాటవినుఁడు!'అనుమాటలు వినఁబడెను.

మరల జగత్సింగుని గుండెలు కొట్టుకొనెను. ఆతనియంతరాత్మ యాతనితో నెద్దియో బోధించి యుండవలెను. అతఁడు శయ్యనుండి లేచి విమలకడ కేగెను.

అందుండి విమల మెఱుపువలె నదృశ్యయయ్యెను. ఆగది యందన్నియు సుగంధద్రవ్యములే పరిమళించుచు మనోహరముగ నుండెను. స్వచ్ఛముగ దీపములు ప్రకాశించుచుండెను. అట నొకవైపున మేలిముసుఁగు వైచికొని యొకవనిత నిలువఁబడి యున్నది. ఆమె తిలోత్తమయే యైయుండును? ఆమె తిలోత్తమ కాదని సందియ మక్కఱలేదు.

## తొమ్మిదవప్రకరణము.

విమల తిరిగివచ్చి తనగదిలో శయ్యపైఁ గూరుచుండెను. ఆమె యభీష్టము సమకూరినది. వదన మానందపారవశ్య,

మును సూచించుచుండెను. అచ్చట నొకదీపము వెలుఁగుచుం డెను. ఎదుట నొకయద్దమున్నది. ఆమె ధరించిన దుస్తులు ప్రారంభమున నున్నట్లే సరిగ నున్నవి. ఒక్కసారి యామె తన యాకారము నాయద్దమునఁ జూచుకొనియెను. ఆహాహా! ఏమి యాజడయందము! ఏమి యాకన్నులతీరు! ఎంత సౌందర్యముగ నున్న దాక్రిందికనుఱెప్పలపై నాకాటుకరేఖ! ఏమి యా యధరలావణ్యము! కుంకుమపూచాయవంటి యా తాంబూల రాగము! ఆకర్ణాలంకారములచేఁ బ్రకాశమానము లగు గండ భాగములు! ఇవియన్నియుఁ దాల్చినవి తాల్పినట్లుండెను. ఆమె యొత్తిగిలి పరుండియుండెను. ఈసమయమున నీతన్వినిఁ దనివి తీరఁ జూచువాని కెవ్వని కన్యయువతులపైకి దృష్టిపోవును? విమల చిఱునవ్వుతోఁ దనసౌందర్యమును విమర్శించుకొనుచు న్నది. అంత ప్రయత్న మొనరించి కష్టపడి నిరుపమానసౌంద ర్యమూర్తియగు జగత్సింహుని, త్రిభువనభూషణమనఁదగు లావణ్యరాశి యగు తిలోత్తమతోఁ గూర్చుటవలన నామె కిప్పుడు విచారముగ నున్నదా? ఆమె కట్టి యాలోచన మెన్నడు నుండదు? ఆమె కిప్పుడు మిక్కిలి సంతోషముగ నున్నది. తాను పూనినకార్యము సఫలమైనదని యామె సుఖిం చుచున్నది. దిగ్గజుఁడు తనవెంట మోహకార్యమున కాసఁ జెంది వచ్చిన దామె కిప్పుడు జ్ఞప్తికి వచ్చి నవ్వుకొనెను.

విమల జగత్సింహునికొఱకు వేచియుండెను. ఇంతలోఁ దాము విడిచి వచ్చిన మామిడితోఁటనుండి యొకబాకాధ్వని వినవచ్చెను. ఆమె యులికిపడి లేచి వెంటనే తనగదినుండి బయ టికి వచ్చుచుండెను. ఇదివఱకుఁ గోటగుమ్మముకడ నట్టి ధ్వనిఁ

జేయువాఁడుక కలఁడు. అది యిట్టి సమయములయం దెన్నఁడును జేయరు. మఱియు నది ద్వారముకడఁ జేసినధ్వని కాదు. అప్పు డామెకుఁ దాను శైలేశ్వరాలయమునకుఁ బోయివచ్చినప్పటి నుండియు జరిగినసంగతు లన్నియు జ్ఞప్తికి వచ్చెను. ఆమె కాధ్వని యాపత్కారణముగ నగపడెను. గవాక్షముకడకు వచ్చి పరికించెను. అం దేమియు నగపడలేదు. భయముతో నామె గదినుండి యీవలకు వచ్చెను. ఆగది కావల దొడ్డియు, దానికావల గదులవరుసలును, వానికడ సౌధముపై కెక్కుట కనువగు సోపానములును గలవు. విమల పైకేగెను. అంతటఁ దిలకించెను. ఎవ్వరు నగపడలేదు. తోఁట గాఢాంధకారముగ నుండెను. ఆమెకు భయము వృద్ధి యయ్యెను. పిట్టగోడకడకు వచ్చి వక్షము దానిపై నానుకొని క్రిందకు వంగి దుర్గము చుట్టు నున్న ప్రదేశమును బరీక్షగఁ జూచెను. ఎవ్వరు నగపడ లేదు. నిండువెన్నెలలోనాకుపచ్చనియాకుజొంపములు మాత్ర ము మెఱసి పోవుచుండెను. ఎప్పుడైనఁ జల్లగాలి కొంచెము విసరి యాజొంపములు కదలి వింతగ మెఱయుచుండెను.తోఁట లోపలి భాగమంతయుఁ గటికిచీఁకటి. అక్కడక్కడమాత్రము వెన్నెల చెట్లయాకులసందునుండి తప్పించుకొనిపోయి మచ్చలు మచ్చలుగ ప్రకాశించుచుండెను. అంచంచలమై నెమ్మదిగఁ బ్రవహించుచున్న యామోదరానదీజలముల సుధాకరుఁడు తారకాగణముతోఁ బ్రతిఫలించుచుండెను. ఆవలియొడ్డున దూరముగ నాకాశము నంటియున్న మేడలు కన్పట్టుచునే యుండెను. ఇవి యన్నియు విమల చూచెను. ఆశాభంగ మొదవ నామె వెనుకకు మరలెను. ఆమె మూఁపుపై నెవ్వరో వ్రేలితోఁ దాకినట్లయినది. తటాలున వెనుకకుఁ దిరిగి చూచెను.

ఆతఁ డాయుధముల ధరించిన పురుషుఁడు. ఆమె యాతని నెన్నఁడు చూచి యెఱుఁగదు. ఆమె కొయ్యవాఱి నిలువఁబడి పోయెను.

'నోరెత్తినచో నిన్ను కోట క్రిందికిఁ ద్రోసివేయుదును?' అని యాపురుషుఁడు విమలను బెదరించెను.

విమల నిట్లాకస్మికముగ నెదిరించినపురుషుఁడు పఠాను వేసమును దాల్చియుండెను. ఆతనివస్త్రము లమూల్యము లయినవి. వానినిబట్టి యాతఁడు సామాన్యసైనికుఁడు కాక యొక గొప్ప యధికారియై యుండు నని విమల తలంచెను. అతఁడు ముప్పదేండ్లకు లోఁపు వయస్సుకలవాఁడు. మిక్కిలి యందమైన వాఁడు. ఎత్తైననుదుటిపై నున్న తలపాగయం దొకయమూల్య వజ్ర మలంకరింపఁబడియున్నది. విమల పూర్ణముగభయము చెందియుండెను. లేకుండిన నాతఁడు జగత్సింహునిసౌందర్య మునకుఁ దీసిపోవువాఁడు కాఁడని విమల గ్రహించియే యుండును. ఆతని శరీరమంత యున్నతమైనది కాదు. వక్షస్థలమైన గొప్పదికాదు. జగత్సింహునందువలెనే ఈతనియందును శౌర్య శృంగారలక్షణము లగపడుచున్నవి. కాని యీతనికాయ మంత కంటె మృదులమైనదిగనుండెను. ఈతనిమొలపట్టియం దొక కటారి యుండెను. ఆకటారికిఁ బవడపుబొత్తములయొర యుండెను. ఆతనిచేత నొక ఖడ్గముండెను.

'నీవఱచినచో నిన్ను కోటమీఁదనుండి క్రిందకుఁ బడ వైచెదను.' అని యాపఠానుఁ డనెను.

విమల స్వభావముగ మనోద్రఢిమ కలది. ఆమె కొదవిన భయము నాశ్చర్య మునొక్కనిమేషమాత్ర ముండెను. రెం

డవసారి యాతఁడుమాటలాడుటతోడనే విమల యాతనియభి ప్రాయము నిట్టె గ్రహించెను. ఆమె యున్నది సౌధాగ్రము. ఎదుట నాయుధకరుఁ డగుయోధుఁడు. యోధులు ప్రగల్భములు వచియింపరు. ఆతఁడు బెదరించినటులే యబల యగువిమలను గ్రిందికిఁ ద్రోసివేయుట యెంత? చతురయగువిమల యిది యంతయు మనమునఁ దలంచి 'నీవెవరవు?' అని ప్రశ్నించెను.

'నావిషయము నీవెఱుంగ నేల?'

'నీ వీ దుర్గమున కేల వచ్చితివి ? దొంగల నగ్నిస్తంభముల కంటఁ గట్టెద రెఱుఁగవా?'

'నేను దొంగను కాను.'

'నీవిట కెట్లు రాఁగలిగితివి?'

'నీదయవలననే—నీవు కిటికీ తెఱచినప్పుడు కోటలోఁ బ్రవేశించితిని. ఇచ్చటకు నీవెనుకనే వచ్చుచుంటిని.' విమల చేతులతో శిరమున మొత్తుకొనియెను.

'నీ వెవరవు?'

'నన్నుఁ దెలుపుకొనుట కింకను సందియ మెందులకు? నేనొక పఠానుఁడను.'

'పఠానుఁడ ననిన నేమి తెలియును? జాతికి పఠానుఁడవే యైనను నీవెవ్వరవో తెలియ జెప్పుము.'

'నాపే రస్మానుఖాన్'

'నే నెప్పుడు నట్టిపేరు వినియుండలేదు.'

'కటుక్ ఖానుని సేనాధిపతిని.'

విమల కంపింపసాగెను. ఏలాగుననైనఁ దప్పించుకొని పాఱిపోయి వీరేంద్రసింహుని కీవర్తమాన మెఱింగింపవలయు ననుపరితాప మామె హృదయమునఁ దపించివేయుచుండెను.– కాని యాపని యెట్లు సాధ్యమగును? అది కేవలమసాధ్యము. మార్గమున కడ్డముగ నాతఁడు నిలువఁబడియుండెను. ఇఁక మఱియొకదారి లేదు. "నే నీతనితో మాటలాడుచుఁ గాలక్షేప మొనరించుచుండినయెడల నాకు భయ ముండదు. ఇంతలో నే కావలివాఁడైన నీప్రక్కకు రావచ్చును." అని తలంచి యామె మరల మాటలాడఁ దొడంగెను.

'నీ వీ కోటలోని కేల ప్రవేశించితివి?'

'వీరేంద్రసింహుని మాపక్షముగ నుండుమని వార్త నంపితిమి. అతఁడు శక్తియున్న సైన్యముతో నెత్తి రండని కయ్యమునకుఁ గాలుద్రవ్వెను.'

'సరియే! నీవనినది గ్రహించితిని. ఈదుర్గాధిపతి మీతో మైత్రి నెఱపక మొగలాయిలపక్షము చేరినందులకు మీరీకోట ముట్టడింప నెత్తివచ్చితిరి. అట్లయిన నీవొక్కఁడవే వచ్చితి వేల?'

'ప్రస్తుతము నేనొక్కఁడనే వచ్చితిని.'

'అందువలననే కాఁబోలు నన్ను పోకుండ నభ్యంతర పెట్టుచున్నావు?'

పఠానునిబారినుండి తప్పించుకొనుట కిఁక నుపాయము లేదని తలఁచి తుద కామె యిట్లు పలికెను. పిఱికితనము నాతని కారోపించినది. కాన నతఁ డిక ధైర్యము నగపఱచుటకుఁ గారణ మగు నని యామె తలంచెను. అతఁ డిట్లు పలికెను.

'కోమలీ! నన్ను వెఱపించుటకు నీకడగంటిచూపులు తక్క నితరాయుధములు లేవు. వానికిఁగూడ నాకంతగా భయము లేదు. అయినను నీతో నింకొక్కపని యున్నది.'

విమల యాశ్చర్యముతో నాతని ముఖముపై నొక్క వాడిచూపు నంపెను.

'నీచెంగున నున్న తాళముచెవి నిటు దెమ్ము! నేను తాకి నచో నీవది యగౌరవముగఁ దలంపవచ్చును.'

విమల చిఱునవ్వుతో 'ఇది మిక్కిలి చక్కనిమాట. నావలన నిష్ప్రాయముఁ గోరుచున్నవాఁడ వింతకుఁ బూర్వము నన్ను కోటక్రిందకుఁ బడఁద్రోయఁ దలంప లేదా?'

'అగత్యమైనప్పుడు ధర్మము విడువవలసివచ్చును. ఇప్పుడైన నవసరమైనచో నట్లొనర్పక మానుదునా?'

పఠానున కిప్పుడు కిటికీతాళము చెవి యత్యగత్యము. ఈసంగతి తెలిసికొనుటకు కుశాగ్రబుద్ధి యగు విమల కెంత కాలము కావలెను? కాని యాతనిఁ దప్పించుకొని పోవుట యెట్లో పాప! మామెకుఁ దోఁపలేదు. తనంతటఁ దాను తాళము చెవి నీయనియెడల నతఁడు బలాత్కారముగనైనఁ గైకొనఁ గలఁడు. మఱి యెవ్వరైన నైనచో నాస్థితియందు తాళము చెవి నిచ్చివేసి యుందురు. విమల యట్లు చేయునా? ఆమె యిట్లు బదులు చెప్పెను. 'నేనీతాళము నీయనిచో నీవెట్లు పుచ్చుకొనఁగలవు?' ఇట్లు మాటలఁ జెప్పుచుఁ దాళము చెవి యున్నవస్త్రము నామె చేతిలోనికిఁ దీసికొనెను. అస్మాత్ తన కన్నులా వస్త్రము మీఁదనే యుంచి యిట్లు పలికెను.

'నీవట్లు తాళముచెవి నీయనియెడల నీకోమలగాత్రము నంటుభాగ్యము నందఁగలను.'

'అట్లే చేయుము.' అని పలుకుచు విమల తనతాళము చెవియున్న వస్త్రమును దోఁటలోనికిఁ బడునట్లు విసరివైచెను. అస్మా నావస్త్రమును జేయిచాపి పట్టుకొనియెను. అస్మాన్ తెలివి తేటలకును జాగ్రత్తకును, విమల యత్యాశ్చర్యము నొందెను. అస్మాన్ విమలచేతులఁ దన కరములఁ బట్టుకొని వస్త్రమును గట్టియున్న తాళము చెవిని మునిపండ్లతో లాగి విప్పి కాసికోక యందు భద్రముగ నుంచుకొనెను. విమల తెల్లబోయెను. అస్మానుఁ డామెచేతులఁ బట్టుకొని యొక స్తంభమునకుఁ గట్టివైచెను.

'ఈవిధముగఁ బ్రవర్తించుటలో నీయభిప్రాయ మేమి?'

'ఈపనియుద్ధమున కవసరము.'

'ఈపాపమున కచిరకాలములోనే ఫల మనుభవింపఁగలవు.'

విమల నట్లేయుంచి యస్మాన్ వెడలిపోయెను. మరలఁ బ్రవేశించి 'స్త్రీల నోరు నమ్మఁదగినది కాదు.' అని పలుకుచు నొకగుడ్డతో నామె నోరు కట్టివేసెను.

అస్మాన్ విమల గదిలోనికి దిగి, కిటికీని దెఱచి మెల్లఁగా నిలవైచెను. పాహరకు లచ్చట విడిచి యొక్కొక్కఁడే లోనికి భటులు ప్రవేశించిరి. అనేకులు భటులు ప్రవేశించిన పిమ్మట నిఁక రావలదని యస్మానుఁ డని 'నేను మీకు సైఁగ చేయుటతోడనే కోటను ముట్టడింపుఁ' డని బయటనున్న వారికిఁ జెప్పి యస్మానుఁడు లోనఁ బ్రవేశించెను. సైనికులతో

నస్మానుఁడు బురుజుపై కెక్కి 'విమలా! నీవివేకమునకుఁ దగిన భృత్యుఁడిదె వచ్చినాఁడు.' అని భృత్యునివంకఁ దిరిగి 'ఈమెను భద్రముగఁ గాపాడుచుండుము. కదలనీయకుము. అఱచుటకుఁ బ్రయత్నించినచోఁ దక్షణమే నఱికివేయుము.' అని చెప్పి వెడలిపోయెను. భృత్యుఁడు విమలకడ నుండెను. పఠాను లొక్కొక్కబురుజునే మీరి కోటయావల ప్రక్కకుఁ బోయిరి.

## పదియవప్రకరణము.

స్త్రీలచంచలకటాక్షములకు లోఁగిపోవనివా రెవ్వరు? అందు విమలవంటిచతుర తనవద్దనున్న రహీమనుపఠానుసైనికు నొకటిరెండుగడియలలో వెఱ్ఱివానిగ నొనర్చిన దనుటవలన నామెకీర్తి కవి ఘోషణమా? విమల ముందర వాఁడెంత? రహీము విమలను బెండ్లియాడుట కంగీకరించి యామెబంధముల విప్పివేసెను. ఆమె రహీముతో లేచిపోవుటకు వలయు విలువగల తనసామగ్రినిఁ దెచ్చుకొని వత్తు నని చెప్పి వెడలిపోయెను. ఆమె చూపినయళీకప్రేమమునఁ దగుల్కొనిన రహీము విమల మాటల నమ్మెను.

"ఇఁకఁ గర్తవ్య మేమి?" అనుకొనుచు విమల లోనికిఁ బరువెత్తెను. వీరేంద్రసింహునకీవార్త యెఱిఁగింప వలెను. ఆయుద్దేశముతో నామె యామీపిరియైన విడువకుండ నాతని పడకటింటి లోనికిఁ బోవుచుండెను. ఆమె శయనాగారమును సమీపింప లేదు. అప్పుడే పఠాను సైనికులు "అల్లాహో!" అని యఱచుచున్న యుత్సాహధ్వనులు వినఁబడుచుండెను.

అబల యగు విమల నిరుత్సాహము నొంది భయవిహ్వల యయ్యెను. ఆమె యొక్క వెఱ్ఱికేక వైచెను. కోటలోని వారం దఱు మేల్కొని రని యామె తలంచెను.

పఠానులు వీరేంద్రసింహుని పడక మందిరములోనికిఁ బోయిరి. ద్వారములు బ్రద్దలఁగొట్టి లోనఁ బ్రవేశించిరి. ఇది యంతయు విమల చూచుచుండెను. అచ్చట నెద్దియో యల్లరి జరుగు చున్నది.

ఆమె తొంగి చూడ వీరేంద్రుఁ డగపడెను. ఆతనినడు మున దట్టీ బంధించి యుండెను. వెఱ్ఱివాని మాడ్కి నాతఁడు కత్తి నటునిటు త్రిప్పుచుండెను. శరీరమునుండి రక్తము ప్రవ హించు చున్నది. అంతలో నాతని యత్నములన్నియు నిరుప యోగ మైనవి. బలము గలపఠానుని కత్తిదెబ్బ కాగలేక యాతనిచేత నున్న కత్తి క్రిందకుఁ బడిపోయెను. ఆతఁ డిప్పుడు పఠానులచేఁ జిక్కెను. దీనినంతయు విమల చూచెను. అధైర్య పడెను. అటనుండి బయలుదేరి తిలోత్తమను గాపాడుట కిం కను నవకాశమున్నదని యటువైపునకుఁ బరువెత్తెను. త్రోవ యందును పఠానులే గుంపులుకూడి యుండిరి. దోచుకొను చుండిరి. తిలోత్తమయున్న చోటికిఁ బోవుట సులభము కాదు. కోట శత్రువులకుఁ జిక్కిపోయిన దని విమల తలంచెను.

తాను తిలోత్తమ కడకుఁ బోయినచోఁ బఠానులచేఁ జిక్కుదునని విమల యనుకొనెను. వెంటనే వెనుకకు మరలెను. చాలవ్యాకులము నొందెను. ఈగొప్పయుపద్రవమును దెలిపి జగత్సింహుని తిలోత్తమను గాపాడుట కెట్లని యామె తల్లడిల్లు చుండెను. ఇంతలో మఱియొకగది కొల్లఁ గొట్టిన

పఠాను లామెవైపునకు వచ్చుచుండిరి. వారినిఁ గని విమల మిక్కిలి భీతి నొందెను. అతిత్వరితముగ నడచి యొకగదియందున్న పెట్టెచాటున నొదిగెను. పఠాను లాగదిలోఁ బ్రవేశించి దోఁచుకొనుచుండిరి. వారు పెట్టెవెనుకప్రక్కకువచ్చినయెడల విమలకనఁబడును. వారి పాలఁబడకుండఁ దప్పించుకొనుభాగ్యములేదని విమల చింతించుచుండెను. ధైర్యముతో నట నామె కొంతసే పుండెను పెట్టె యంచుమీఁదనుండి విమల మెల్లఁగా వారిచర్యలఁ గనుపెట్టుచుండెను. విమల నిరుపమాన ధైర్యవతి. ఆపద హెచ్చినకొలఁది నామెధైర్య మతిశయించుచుండెను. పఠానులు దోపిడియందు మగ్నులై యుండుటఁ గాంచి యామె యటనుండి లేచి మెల్లఁగ నడుగులిడుచు నీవలఁబడఁ బ్రయత్నించెను. కొల్లగొట్టుటయందే యాసక్తితో నున్న పఠాను లామెను జూడలేదు. ఆమె తలుపు దాఁటి పోవుచుండ నొకపఠానుఁ డామె నాకస్మికముగవచ్చి పట్టుకొనెను. అతఁడు రహీముఖానుఁడు!

'ఇప్పుడు పరుగెత్తుము. ఎక్కడకుఁ బోవుచున్నావు?'

విమల రహీమునకు మరలఁ జిక్కినది. తెల్లపోయి కంపించుచుండెను. ఆమె వెలవెలపాటును రహీము గ్రహింపలేదు. చతురయగు విమల నవ్వెను. 'పెట్టివాఁడా! అఱవకుము. నాతో రమ్ము! చెప్పెదను.' అని యాతని లాగుకొని పోవుచు "నీ నీచునిమూలముననే నేను తప్పించుకొనవలయును.' అనుకొనెను. ఆతఁ డామెవెంటఁ బోవుచుండెను.

'మంచివాఁడవు! వారందఱు నుండఁగ నట్లొనరించెదవా? సిగ్గుసిగ్గు! నన్ను విడిచి నీవెక్కడకుఁ బోయితివి? నేను

నీకొఱ కెంతవెదకితిని?' అని విమల పలికెను. ఆమె క్రీగంటి చూపుతో నాసాహేబు కోపాగ్ని చల్లారెను. ఆతని గొప్ప బుద్ధి విమల చంచలకటాక్షములలో లీనమై యదృశ్య మయ్యెను.

'జగత్సింహుని సమాచారముల నెఱిఁగింప సేనాధిపతి కొఱకుఁ బోయితిని. ఆతఁడు కనఁబడలేదు. మరల బురుజు మీఁదికి వచ్చితిని. కాని నీవచ్చుటనుండి పోయితివి. అప్పటి నుండియు నీకొఱకు వెదకుచున్నాను.'

'ఎంతసేపటికిని రాకపోవుటచే నీవు నన్ను మఱచితివని తలంచితిని. అందుచే నిన్ను వెదకుచు బయలు వెడలితిని. దానికేమికాని యిఁక నాలస్యము చేసిన ప్రయోజన ముండదు. మీవాండ్రు కోటను బట్టుకొనఁ గలిగినారు. ఇఁక మనకిప్పుడు పలాయనమే——'

'ఈరాత్రి సమయమునందే! రేపుదయమున సేనాధి పతితోఁ జెప్పకుండ నేనెట్లు వచ్చుట? సెలవు గైకొని రేపు ప్రాతఃకాలముననే పోవుదము.'

'మన మప్పుఁడే పోవచ్చును కాని నాయాభరణములు మొదలైనవి జాగ్రత్త పఱుపవలెను. లేకుండిన నితరసైనికు లవి యపహరింపరో?'

'అయిన సరియే!'

విమల రహీమును వెంటఁదీసికొని పోయినది. యితర సైనికుల బారి పడకుండఁ దప్పించుకొనుటకే కాని వేఱుకార ణము లేదు. ఆమె యనుకొనినట్లే యైనది. ఇంతలోఁ బఠానుల

రెండవగుంపు వారి కెదురుపడెను. వారు విమలను జూచి 'ఇదిగో! జారిణి!' అనిరి.

'సోదరులారా! ఇట రాఁబోకుఁడు. మీపనులఁ జూచుకొనుఁడు.' అని రహీ మనెను.

సైనికు లాసంగతిని గ్రహించి వారిని వదలివేసి వెడలిపోయిరి. విమల రహీమును గ్రిందనున్న తనపడకగదిలోనికిఁ దీసికొనిపోయెను.

'ఇది నాపడకగది. ఇందు నీకు వలసినసామగ్రులను దీసికొనుము. మనక్రొత్తసంసారమున కన్నియు నవసరములే! ఈపైనున్నది కూడ నాగదియే! అటనున్న విలువగల సామానులఁ దెచ్చెద. త్వరపడుము.' అని చెప్పుచు నామె తాళము చెవులగుత్తుల నటఁ బారవైచెను. ఆమె బయటికిఁ బోవుచు రహీమున్నగదికిఁ దాళము వైచి మఱిపోయెను.

విమల మేడమీఁదికిఁ బరుగెత్తెను.

కోట కావలభాగమున నున్నతిలోత్తమగదికడ నీయల్లరు లేమియు లేవు. అది యీయల్లరి జరుగుచున్నచోటకుఁ జాలదూరము. విమల యాతొందరసమయములో కూడ తిలోత్తమా జగత్సింహు లేమి చేయుచున్నారో చూడవలె నని కోరినది. తలుపుసందునుండి చూచినది? ఆమె అంత యాశ్చర్యము బొందుచున్న దేమి?

తిలోత్తమ శయ్యపైఁ గూరుచుండ జగత్సింహుఁడు లేచి లావణ్యరాశి యగునామె మృదుహస్తముల నాతఁడు పట్టుకొనియుండెను. ఆతఁడు కన్నులఁ దుడుచుకొనుచుండెను. విమల యిట్లు తలంచెను.

'కన్నీరు విడుచుచున్నారు. ఇప్పుడు వీరొండొరులు సెలవుతీసికొనుచున్నట్లున్నది. ఏమైన నేమి? ఇప్పుడు సంభవించి యున్న యీమహాపదను వీరెఱుఁగరు కదా! ఆహా! ప్రపంచమునందు ప్రేమమే మహాద్భుతమైనది. ఓ ప్రణయమా! మహావిపదంబుధి నున్నవీరి కీతరంగములహోరు వినఁబడకుండ వీరి చెవులలో నేమి యుంచితివి. వారికోమల సంభాషణములేనా? ఆసంభాషణసమయమున సర్వప్రపంచమును మఱచి పోవుదురా ?.



## పదునొకొండవ ప్రకరణము.

విమల గదిలోనికిఁ బోయి, సంభవించిన విపత్తును జగత్సింహునితోఁ జెప్పెను. వినఁగానే యాతఁ డామాటలు నమ్మలేదు. ఇంతలో పఠానులకేకలు వినఁబడినవి. అతని సందియము నశించెను.

"రాజకుమారా! త్వరగ వెడలిపోవుట కెద్దియైన నుపాయ మాలోచింపుము. లేనిచో మనము నశించిపోవుదుము." అని విమల పలికెను.

జగత్సింగొక్కనిమిషమునే పాలోచించెను. "వీరేంద్రసింహుఁ డేమిచేయుచున్నాఁడు" అని యడిగెను.

"శత్రువులచేఁ జిక్కినాఁడు."

తిలోత్తమ యొక్కకేకవైచి మూర్ఛనొందెను. జగత్సింగు తెల్లపోయి "రక్షింపుఁడు! తిలోత్తమను రక్షింపుఁడు!" అనెను. విమల వెంటనే పన్నీరు బుడ్డినిఁ దెచ్చి యామెపైఁ జల్ల

నారంభించెను. విసరుచుండెను. కలకలము క్రమముగా సమీపించుచుండెను.

"వారదే వచ్చిరి. ఈపఠానులనుండి తప్పించుకొనునుపాయము" అని విమల యడిగెను.

జగత్సింగు మండిపడుచుండెను ఆతని నేత్రములు చింత నిప్పులువలె నయ్యెను.

"ఓ దైవమా! నీయనుజ్ఞ యిట్లున్నదా? ఈ ఘోరవిపత్తులో సైతము నేనీ యీడువాండ్రలో దాఁగి యుండవలసినదేనా?"

'కర్తవ్యము చూడుము. నేను మీకే యుపకారమును జేయఁజాలకపోయినను తిలోత్తమప్రక్కఁబడి మరణించెదను.' అని విమల పలికెను. రాజుమనసున కడి ముల్లువలె నాటెను. 'ఇట్టివిపత్తులోనున్న యీమెను వీడి నేనెట్లుపోఁగలను. ఆమెకై నేనుకూడఁ బ్రాణముల విడిచెదను.' అని రాజనెను.

అంతకంతకుఁ బఠానుల కోలాహలము సమీపించుచుండెను. కత్తులు గణగణ మ్రోఁగుచుండెను.

"తిలోత్తమా! ఇట్టి దురవస్థసమయమున నీవుకూడ మూర్ఛపొందితివా?" అని విమల దుఃఖముతో ననుచుండ తిలోత్తమ కన్నుదెఱచెను.

'తిలోత్తమ జీవించియున్నది. ఆమెను రక్షించుట కింకను అవకాశమున్నది.'

"ఇఁక మనల రక్షింప దేవతలకైన సాధ్యము కాదు. అదిగో! వారలు మేడమెట్లెక్కుచున్న ధ్వని. మన మీగది విడిచిన నిన్నీకోట వెలుపలకుఁ దీసికొనిపోఁగలను. కాని తిలో

త్తమకు సాయ మెవరు? ముందు నాప్రాణము వర్జించెదను- అయ్యో! ప్రాణముల నిచ్చియు మిమ్ము రక్షింపఁ జాలకున్నాను కదా!'

'ఒక్కనిమిషములో తిలోత్తమను నేను తీసికొని వచ్చెదను.' అని విమల నుడివెను. తత్క్షణ మిరువురును ద్వారము కడకు వచ్చిరి. వారికి పరుగెత్తుచున్న నల్వురు పఠాను లగు పడిరి.

'విమలా! చేయునది లేదు. నీవు నావెనుకకు రమ్ము!'

ఆమాటలు పఠానులు వినిరి. 'అల్లాహో!' అని యఱచి రాక్షసుల వలె వారిపైఁ బడిరి. నల్వురుపఠానులతో ద్వంద యుద్ధము సమకూరినది. జగత్సింహుఁ డెంత పరాక్రమవంతుఁ డైన నొక్కఁడు. ఆ నల్వురుపఠానులను జయించెను. క్రొత్త యేటిప్రవాహమువలె వచ్చుచున్న పఠానుల నెదుర్కొనుచుం డెను. రాజపుత్త్రునకు గాయములుపడుచున్నవి. కొంతవడి కాతఁడుఁక లాభము లేకసుకొనెను. శరీరమునుండి రక్తము గాటముగఁ బ్రవహించుటచే నాతఁడు దుర్బలుఁ డయ్యెను.

తిలోత్తమ కింకను మూర్ఛయే! విమల తిలోత్తమ నామెపై బరుండఁబెట్టుకొనెను. విమల వస్త్రములన్నియు జగ త్సింగురక్తముచేఁ దడసిపోవుచున్నవి.

గడియంతటఁ బఠానులే! జగత్సింగు శ్రమతీర్చుకొనుట కాగెను. ఒకపఠానుఁడు 'బానిసా' యని పిలిచి జగత్సింగును లోఁబడుమనెను. ఆరుచున్నయగ్ని గాలికిఁ బ్రజ్వరిల్లినట్లు జగ త్సింహుని శౌర్యాగ్ని యామాటకుఁ బ్రజ్వరిల్ల 'తురుష్క

లారా! రాజపుత్రుఁ డెట్లుమరణించునో చూడుఁ'డని విజృంభించెను. కత్తికందినవారి ప్రాణములనెల్ల నాహుతిఁగొనుచు ప్రచండమార్తాండునివలె నతఁ డజేయుఁడై యుండెను. వెఱ్ఱివానివలెఁ బ్రాణములపై నిరాశనొంది కత్తిఁ ద్రిప్పుచు మరణించులోపల దొరకినపఠానుల నెల్లఁజంపి శత్రుమారణమునే చూచుచుండెను. ఆతనికొడలు తెలియుట లేదు. హస్తముల పట్టు వదలెను. చైతన్యము తగ్గుచుండెను.

'రాజపుత్రునిఁ జంపఁగూడదు. పట్టి బంధింపుఁడు.' అనునాజ్ఞ భీకరముగ వినఁబడెను. ఇవి యస్మానుఁడు పలికిన వాక్యములు.

రాజపుత్రునికరమునుండి కరవాలము ఠణఠణమనుచుఁ బడిపోయెను. చచ్చిపడియున్న యొకపఠానుసైనికునిశవముపై జగత్సింగు పడిపోయెను. పఠానుసైనికులు రాజపుత్రుని తలపాగయందున్న వజ్రము నపహరింప దుముకుచుండిరి. 'ప్రాణములపై నాసయున్నవారు రాజపుత్రు నంటకుఁడు!' అని యస్మానుఁ డఱచెను.

తిలోత్తమతో నేశయ్యపైఁ బరుండ జగత్సింగు మానసికముగఁ దలంచెనో, ఆశయ్యపై నిప్పుడు జగత్సింగు నస్మానుఁడు పరుండఁబెట్టెను. ఆహా! ఇచ్ఛావైపరీత్యము!

ఈ గందరగోళములో విమల తిలోత్తమతోఁ బోయి. గదిలో నొకమూల దాఁగెను. అస్మానుఁడు వారికై వెదకించెను. విమల తెలివితేటలవలనఁ జాలసేపటివఱకు వారిని బఠానులు కనుగొనలేకపోయిరి. తుదకుఁ బట్టుపడిరి.

తిలోత్తమకు మరలఁ బ్రాణములు వచ్చినవి. ఆమె యిప్పుడు లేచికూర్చుచుండెను. 'మనమిప్పు డెక్కడ నున్నాము?' అని యామె మెల్లఁగ విమల నడిగెను.

'భయము లేదు. మేనిముసుఁగు తిన్నగ సర్దుకొనుము.' అని విమల పలికెను.

వనితలను బట్టుకొనిన పరిచారకుఁ డొక మొగలాయి గైనట్లువారి సంభాషణవలన విమల గ్రహించెను ఆమెకంపము నొందుచు వెనుక నభిరామస్వామి యొకనాఁడు వీరేంద్రునితోఁ దిలోత్తమ యొక మొగలాయిచేఁ జిక్కు నని చెప్పిన జ్యోతిషము జ్ఞప్తికిఁ దెచ్చుకొనెను. అందువలననే కదా వీరేంద్రుఁడు మానసింగుతోఁ జేరవలెనని యభిరామస్వామి చెప్పెనని విమల యనుకొనుచుండెను.

మొదటిభాగము సంపూర్ణము.

———

శ్రీ ర స్తు.

# దుర్గేశనందని

## ద్వితీయభాగము.

---

### మొదటి ప్రకరణము.

జగత్సింగు కన్నులు విచ్చి తానదివఱ కెన్నఁడు జూడని యొక మనోహరమందిరమున నలంకరింపఁబడియున్న విశాలమైనగదిలో శయ్యపైఁ బరుండియున్నట్లు తెలిసికొనియెను. క్రిందఁ బరుపఁబడిన మెత్తని రత్నకంబళముపై బంగారము, వెండి, దంతము మొదలగువానితోఁ జేయఁబడిన వస్తువులును, సువాసనాద్రవ్యములు గలబుడ్లును యథాస్థానముల నలంకరింపఁబడి యుండెను. ద్వారములకుఁ జలువకొఱకు వట్టివేళ్ల తడకలు కట్టఁబడి యుండెను. పరిచారికలు వానిని బన్నీటితోఁ దడుపుచుండిరి. గదియంతయుఁ బరిమళమిళితమై యుండెను. ఎవ్వరును మాటలాడుట లేదు. ఒకయువతి జగత్సింహునకుఁ బన్నీరు చిలుకరించిన విసనకఱ్ఱతో మెల్లఁగ విసరుచుండెను. మఱి యొకతె దూరముగ నిలిచియుండెను. ఆతఁడు శయనించిన మంచముపై నొక రమణీమణి కూర్చుండి గాయములకు మందు రాయుచుండెను. తివాసిపై నుచితవేషముతోనున్న యొక పఠానయువకుఁడు తాంబూలము వేసికొనుచుఁ దనలోదానే యొకపుస్తకమును చదువుకొనుచుండెను. గదియంతయు నిశ్శబ్దముగ నుండెను.

రాజకుమారుఁడు నలుదెసలఁజూచి యొత్తిగిలఁబోయెను కాని గాయములబాధచేఁ గదలలేకపోయెను. అప్పుడు ప్రక్కను గూర్చున్న కాంత మృదువచనములతో 'కదలవలదు' అని పలికెను.

జగత్సింహుఁడు హీనస్వరముతో 'నేనెక్కడ నున్నాను' అని యడిగెను. 'మాటలాడవలదు. మీరు తగినచోటనే యున్నారు.'

'ఇప్పు డెంత ప్రొద్దెక్కినది.'

'రెండుజాము లైనది. మీరు మాటాడుట మంచిది కాదు. జబ్బెక్కువ యగును.'

'ఇంకొక్కమాట యడిగెదను. నీ వెవ్వరు?'

'నా పే రయేషా.'

ఆతఁ డించుక మోమెత్తి యామెమొగమువంకఁజూచి యాలోచించుచుండెను. ఆతఁ డెన్నఁడైన నామెను దర్శించి యుండెనా! లేదు. ఆమె యిరువది-యిరువది రెండేండ్ల తరుణీమణి. అసాధారణం బగునామె సౌందర్యముం గూర్చి యొకటి రెండుమాటలతోఁ దెలుపఁ జాలము. తిలోత్తమ సుందరశిరోమణియే యైనను నామెతో నయేషాను బోల్చుటకు వలను పడదు. హృదయాకర్షకంబులును నిత్యనూతనంబులు నగు విమల రూపరేఖలుకూడ నయేషా శాంతరమణీయక కాంతుల కడ నెందులకును గొఱగావు. కొందఱువిలాసినుల సౌకుమార్యములు వసంతమున వికసించిన సుగంధకుసుమములఁ బురుడించుచుండును. అప్పుడే వికసించిన మల్లికాకుసుమమువలె మధుర

మయంబును బరిమళమిళితంబునునగు నెలజవ్వనమునం దోఁచు లజ్జచే నించుక ముకుళించిన మనోహరాంగకములు గల తిలోత్తమా రామణీయక మాజాతిలోనిదని చెప్పవచ్చును. విమల చెలువము మధ్యాహ్న సమయమునందలి మెట్టదామరవలె ముకుళనోన్ముఖమై యార్ద్రంబును బరిమళమిళితంబును గాక యుండియుఁ దేజోవిలాసవిరాజితంబును బరిపక్వమాధురీమయంబును సంపూర్ణవికసితంబును నై విలసిల్లుచున్నది. ఇఁక నయేషాలావణ్య ముదయభానుకిరణప్రసారంబున దరవికసితంబగు సరోజకుసుమముంబోలి చెలువందుచుండెను.అంతటి తేజోమయసౌందర్యమును దివ్యసౌరభమును మాధుర్యమును కుసుమరాజంబగు ప్రభాతకమలమునందొక్క-చోటమాత్రమే మనము చూడఁగలము. అయేషాలావణ్యకుసుమము దరవికసితమై సరసమై మాధురీయుతమై సుగంధవిలసితమై ప్రేమార్ద్రమై చెన్నొందుచున్నది. అయేషాలావణ్య కిరణప్రసరణంబునఁ బ్రపంచమునందలి యెల్లవస్తువులునుఁ జిఱునగవుచే ముద్రింపఁబడుచుండును.

కమలాకరమునకుఁ గమలమువలె నయేషా మనకథకలంకారమైనది. ఆమెయొడలిచాయ కేవలము సంపెఁగవలెఁ బచ్చనిది కాదు. మంకెనవలె నెఱ్ఱనిదియుఁగాదు. తామరపూవువలెఁ దెల్లనిదియునుగాదు. ఈమూఁడురంగులును మిశ్రమమైన నెట్లుండునో యట్లుండెను. విశాలమగు నామెనెన్నుదురు మస్తమునివిలాసరంగమని చెప్పవచ్చును. అందామె నీలంపు ముంగురులు మనోహరముగ నల్లుకొనియుండెను. పట్టువలె నతిమృదులమై మబ్బువలె నతినీలమైయున్న కేశపాశము చక్కఁగసంస్క-

రింపఁబడియుండెను. కనబడక సన్నములుగాఁ గొనలు చేరి క్రమముగా నభివృద్ధినందుచు భూమిమధ్యప్రదేశమున నొక దానినొకటి ముద్దుపెట్టుకోఁ జూచుచున్నవో యనునట్లున్న యామె కనుబొమలు నున్ననై నల్లనై యెత్తై మనోహరముగ వంగియుండెను. నీలములవలె నిగనిగలాడు కనుపాపలతోడను, పుండరీకదళంబులంబోలె రక్తరేఖలతోడను, విలసిల్లునామెవిశాలనేత్రములు లావణ్యరసంబునం దేలియాడు గండుమీలవలె మిలమిలలాడుచుండెను. నూవుపూవువలె సమగ్రమై సంపెఁగ వలె నామోదదాయకమై యొప్పారు నామెనాసికయు, చిగుల వలె మృదులంబులును, పవడములవలె రాగనిధానంబులునై యమృతనిలయంబులగు నామెయధరోష్ఠములును, చంద్రకాంతమువలెఁ దేజోమయంబును శంఖమువలె మనోజ్ఞంబు నగు నామె కంఠసౌందర్యమును, కర్ణకుండలకాంతులచే మిలమిల లాడుచు శృంగారరసంబును జిలుకరించుచుండు నామె మెఱుఁగు జెక్కులును చూచి తీరవలయునే గాని వర్ణించుటకుఁ దరముకాదు. వర్తులమ్ములై తామరతూడువలె మృదులమ్ములై యున్న యామె మృదుకరములు మణికంకణములు మొదలగు నలంకారముల కలంకారములై యుండెను. ఆమెకోమలాంగుళులు రవలయుంగరములచే మెఱయుచుండెను. ఆమెకంఠమువం దాల్చిన ముత్యాలహారములు విశాలోన్నతం బగునామె వక్షస్థలకాంతులలో మునిఁగి పోవుచుండెను. ఆమె మనోహరాంగకము లన్నియు నుచితశోభావంతములై లావణ్యామృతమును గ్రుమ్మరించుచుండెను. వేయేల? ఎన్ని సాధనములున్నను, ఎంతనేరుపున్నను, ఎంతశక్తియున్నను, ఆమె యథారూప

మును జిత్రించిచూపుట కెట్టిఘౌర్ధుఁడు సాహసింపఁజాలఁడు. సాహసించినను కృతార్థుఁడు కాఁజాలఁడు. ఆమె మనోహర సౌందర్య మిట్టిదని నిరూపించుటకుఁగాని చిత్రించుటకుగాని యసాధ్యమైనది. ఈమిథ్యాప్రపంచమున సత్యమైనపదార్థ మామె సౌందర్య మొక్కటియే యని చెప్పవచ్చును. మనోహరప్రకృతియందా మెయొక్కతెయే మనోహారిణి.

అట్టి రమణీమణిని జూచినతోడనే జగత్సింహునకుఁ దిలోత్తమ జ్ఞప్తికివచ్చెను. ఆతని రక్తనాళములు చలియించెను. గాయములనుండి యుష్ణరక్తము పొంగిపొరలసాగెను. ఆతఁడు కన్నులు మూసికొని స్మృతితప్పి పడిపోయెను. అయేషా తత్క్షణమే శయ్యనుండి లేచెను. క్రిందఁ దివాచిపైఁ గూరుచుండి యస్మానుఖాను చదువుకొనుచున్నాఁడు. కాని యాతని దృష్టి పుస్తకముమీఁద లేదు. అయేషావంకనే తఱచుగఁ బ్రసరించుచుండెను. శయ్యనుండి లేచుచున్న యయేషా సొగసు కూడ నాతనికిఁ బన్మయత్వముం గూర్చివైచెను.

అయేషా యాతనియొద్దకు వచ్చి 'శీఘ్రముగ వైద్యుని దీసికొనిరమ్ము' అని చెవిలోఁ జెప్పి యాతని బంపివైచెను. తరువాత నామె రాజపుత్త్రుని పార్శ్వమునఁ గూర్చుండి యాతని మొగమును ఫాలతలమును గూడ జల్లనిజలముతోఁ దడుపుచుఁ దెలివివచ్చునేమో యని యాశతోఁ జూచుచుండెను. ఇంతలో నస్మాను వైద్యునితోఁ గూడ నచ్చుటకి వచ్చెను. వైద్యుఁడు రక్తము నాపుటకుఁ దగినమందుల నిచ్చి వాని నుపయోగించు పద్ధతులను దెలిపెను. వైద్యుఁడు చేయి చూచి 'జ్వరము చాలహెచ్చుగా నున్నది. ఈమందిచ్చి చూడుఁడు!

తరువాత మరల వచ్చిచూచెదను' అని చెప్పి యాతఁడు సెలవు దీసికొని వెడలిపోయెను. ఆతఁడు పోవుచుండఁగా నస్మా నాతనితో రహస్యముగా 'ఈజబ్బు కుదురునా?' అని యడిగెను.

'నమ్మకముగఁ జెప్పఁజాలను. ఈత్రొందర యడిగిన తరువాత నాకు వర్తమానము చేయుఁడు. అప్పుఁ డింకొకసారి చూచి చెప్పెదను' అని చెప్పి వైద్యుఁడు వెడలిపోయెను.

## రెండవ ప్రకరణము.

జగత్సింహునకుఁ దెలివియు మఱపుగ నుండెను. మాటిమాటికి వైద్యుఁడు వచ్చిపోవుచుండెను. రాత్రి పండ్రెండుగంటలవఱకు నయేషా యాతని గనిపెట్టుకొనియేయుండెను. అస్మానుఖానుకూడ నచ్చటనే యుండెను. అప్పు డొకదాసి వచ్చి యయేషాతో "అమ్మా! అమ్మగారు మిమ్ము రమ్మన్నారు." అని చెప్పెను. తోడనే యయేషా పరిచారికులతో భద్రమని చెప్పి తల్లియొద్దకుఁ బోవుచుండెను. అస్మానుకూడ నామెతో బయలుదేరిపోవుచు "ఈరాత్రి నీవు బీగమునొద్దనే యుండెదవా?" అని యడిగెను.

అయే.—ఉండను. తిరిగి యిచ్చటకు వచ్చెదను.

అస్మా.—నీవంటిదయావతు లీప్రపంచమున నెవ్వరును లేరు. మీతండ్రికిఁ బ్రబలవిరోధియనియైనఁ దలంపక నీవీతనిప్రాణములఁ గాపాడుచుంటివి. ఆతనిసోదరివైన నిట్లుపచారము చేయఁగలుగు నని నే ననుకొనను.

అయే—(చిఱునగవుతో) ఈలోకమున నేనాఁడుదానినై పుట్టి తిని. వ్యాధిగ్రస్తునిఁ గాపాడుట నాకవశ్యకర్తవ్యము. విధాయకకృత్యమును దీర్చినందులకు నాకెట్టి ఘనతయును రాదు గాని యుపేక్షించినచో మాత్రము పాపాత్మురాల నగుదును. కాని, నీ కీతఁడు గర్భశత్రుఁడుగదా. నీకీతనిపై నింతదయ యేల కలిగినది? నీచేతులతోనే నీ వీతని నిట్టి దశకుఁ దెచ్చి మరల నీతనిసంరక్షణవిషయంబున నింతశ్రమ పడుచుంటివేల? ఇది యంతయును నీయుదారహృదయ మునే ప్రకటించుచున్నది.

అస్మా—అయేషా! లోకులందఱు నీవంటిసరళహృదయులే యనుకొనుచున్నావు. నేను నీ వనుకొనునంతటి యుదార హృదయుఁడను గాను. ఈతఁడు మరణించుటకంటె జీవిం చుటవలననే మాకెక్కువలాభమున్నది. ఈతఁ డిచ్చట జీవములతో బందియై యున్నచో మానసింహుఁడు మా చెప్పినట్లు పనిచేసి కుమారునికై మాకు లాభకరముగ సంధి చేసికొనును. కృతజ్ఞుఁ డగుజగత్సింహుఁడుకూడ నీవిషయమున కనుకూలుఁడే యగును. ఎట్లుచూచినను యుద్ధముచేసి జయముగొనుటకంటె నతని గాపాడుటయే సర్వశ్రేయమని యెంచి నే నీతని విషయమున నింతశ్రద్ధ సేసికొనుచున్నాను.

అస్మాను చెప్పిన దంతయును సత్యమే. కాని యాతని హృదయమున దయాస్వభావము లేకపోలేదు. మృదులహృద యములు స్త్రీజనసామాన్యములు కావునఁ దమ్ముఁగూడ నబలా జనముతోఁ బరిగణింతురేమో యనుసంశయముచేతఁ గొందఱు

పౌరుషవంతులు పైకిఁ గర్కశహృదయులవలె నటియించు చుందురు. వారెప్పుడును మంచినే చేయుచుఁ దమదయాస్వభావమును గంభీరముగ మఱుగుపఱచుకొనియుందురు. అస్మాను కూడ నట్టితరగతిలోనివాఁడని యయేషా యెఱుంగును. ఆమె చిఱునగవుతో 'అస్మాన్! దైవానుగ్రహమున నందఱును నీవంటివారైన నెంతయో బాగుగ నుండును. అట్లయిన నీలోకమున మంచి యనుమాటయే లేకుండఁ బోయియుండును' అని యెను.

అస్మాను మెల్లగా 'అయేషా, నేనట్టివాఁడనే. ఇంకొక సంగతి—' అనునంతలో నయేషా తన మెఱుపుచూపుల నాతని పైకి మఱలించెను.

అస్మా—అడియాసతో నేనెంతకాల మిట్లు జీవింపవలయును?

అయేషా యట్లే చూచుచుండెను. ఆచూపులలో వింత చెలువము లాతనికన్నులఁ బడుచుండెను.

అయే—ఆసంగతింగూర్చి నీకనుకూలుఁడగు నాతండ్రిగారి నడుగుము.

అస్మా—అడియు నయినది. అయేషా యెవ్వనిఁ బ్రేమించునో యాతనికే యామెనిచ్చెదనని మీతండ్రి బిగముతోఁ జెప్పియున్నాఁడు. ఎన్నాళ్లకును నీమనోనిశ్చయము నాకుఁ దెలియుటయే లేదు.

అయే—(మందహాసముతో) స్త్రీహృదయములఁ గ్రహింపఁగల పురుషు లెక్కడైన నున్నారా?

అస్మా—ఈస్థితినిగూర్చి నే నేమని నమ్ముకొనవలసి యుండును?

అయేషా—నిన్ను, ప్రేమించుచుంటి నని,
అస్మా—ప్రాణేశ్వరునిగనా?—
అయేషా—ప్రియసోదరునిగా.—

అస్మాను తెల్లపోయెను. 'అయ్యో! ఇంకను నీయుద్దేశ మిట్లే యున్నదా? హా! హతవిధీ! ఈతన్వంగి వజ్రహృదయ మును బూవులలో నేల పోఁడివితివి?' అనెను.

అస్మాను పరితప్తహృదయముతో నయేషాను తల్లి కడ కంపి తనయింటికిఁ బోయెను.

---

## మూఁడవ ప్రకరణము.

మఱునాఁటిసాయంకాలము జగత్సింగు శయనించినగది యందు వైద్యుఁడును, అస్మానుఖానును, అయేషాయు నిశ్శబ్ద మునఁ గూర్చుండియుండిరి. అయేషా ప్రక్కపైఁ గూరుచుండి జగత్సింహున కుపచారము సేయుచుండెను. వైద్యుఁడు మాటి మాటికి నాఁడికఁ జూచుకొనుచుండెను. "ఈరాజజ్వరము తగ్గిన తోడనే యీతఁడు మరణించును. తప్పినచో నీతనిజబ్బు కుదుర వచ్చును' అని వైద్యుఁడు చెప్పెను.

క్రమముగా జ్వరము తగ్గిపోవుచుండెను. అందఱును గని పెట్టుకొనియుండిరి. వైద్యుఁడు నాడిని నిదానించుచుండెను. జగత్సింహుని ముఖవికాసము భేదించుచుండెను. వైద్యుఁ డట్లే నిదానించి "ఆశ లేదు. నాడి చెదరిపోయినది" అనియెను. అయేషావదనము వివర్ణమయ్యెను. అంతలో రోగిమొగము వికృతమగుచుండెను. కన్నులు తేలిపోవుచుండెను. అయేషాఽ స్మానులహృదయములు చలించిపోవుచుండెను. ఆమరణ చిహ్న

ములం జూచి హతాశుఁ డయ్యెను వైద్యుఁడు తుదిమందు నాతని నోటఁ బోసెను. అంతలో గుణ మగపడియెను. క్రమ క్రమముగ వికారములు తగ్గుచుండెను. వైద్యుఁడు మరలఁ జేయి చూచి 'మఱిమియు భయము లేదు. అప్పుడప్పు డీయాష ధము నిచ్చుచుండుఁడు. రెండు జాములకు బాగుగ నెమ్మది కలుగును.' అని చెప్పి వెడలిపోయెను. అస్మానుకూడ నింటికిఁ బోయెను. అయేషా రోగిప్రక్కనే కూర్చుండి సరిగ నౌషధము నుపయోగించుచుండెను. రెండుజాము లగునప్పటి కాతఁ డెప్పటి స్థితికి వచ్చెను. ఆతఁడు కన్నులు విచ్చి చూచెను. ఆ చూపులలో నాతని హృదయావేగ మగపడుచుండెను. ఆతఁ డేదియో స్మృతికిఁ దెచ్చుకొనఁ దలంచెను. గాని కార్యము లేకపోయినది. అదేరీతిగ నయేషావంకఁ జూచి "నే నెక్కడ నున్నాను?" అనియెను.

అయే.—కటులుఖాను ని దుర్గము?

జగ.—ఇక్కడ నెందుల కున్నాను?

అయే.—జబ్బుచేయుటచేత—

జగ.—కాదు- కాదు-పట్టువడుటచేత—

అయేషా మారువలుకలేదు. ఆతనికిఁ గ్రమముగ స్మృతి గలుగుచున్నదని తెలిసికొనియెను.

జ.—నీవెవ్వరు!

అ.—నాపే రయేషా యందురు.

జ.—అయేషా యన నెవరు?

అ.—కటులుఖానుని తనయ.

జగత్సింగు చాలసేపటివఱకు మాటలాడ లేదు. తుదకు 'నే నిచ్చట నెన్నాళ్లనుండి యున్నాను?' అనియెను.

అ—నాలుగుదినములనుండి యున్నారు.

జ—ఇంకను మందరగడము మీ చేతిలోనే యున్నదా?

అ—ఉన్నది.

జ—వీరేంద్రసింహుఁడో?

అ—అతఁడు బందియై యున్నాఁడు—నేఁ డాతనివిచారణ.

జ—తక్కినవారో?

అ—నాకన్ని సంగతులును దెలియవు.

జగత్సింహునినాలుకతుదినుండి యస్పష్టస్వరములు బయలు దేరెను. ఆస్వరములలో 'తిలోత్తమ' యను నామాక్షరము లయేషా చెవులఁ బడియెను.

అయేషా మరల మందు దెచ్చుటకై లేచెను. ఆమె కర్ణాలంకారములు చలించుచుండెను. ఆయతిలోకరామణీయక నిధింగూర్చి జగత్సింగు మననము చేయుచుండెను. ఇంతలో నామె యౌషధమును దెచ్చి యిచ్చెను. జగత్సింగు దానిం దీసికొని 'నే నొడలెఱుంగక పడిపోయినప్పుడు నాతలయంపి నొక్కదివ్యవనిత కూర్చుండి నాకుపచారములు చేయుచున్నట్లు కలఁగంటిని. నీవేనా యాతిలోత్తమవు' అనియెను.

'మీరు కలలోఁ దిలోత్తమను గాంచియుందురు' అని యయేషా బదులు చెప్పెను.



## నాలుగవ ప్రకరణము.

మందరగడము స్వాధీనమయిన రెండుదినములకుఁ బిమ్మట మధ్యాహ్నసమయమునఁ గటులుఖాను కోటలో కొలువుదీరియుండెను. సభాసదులందఱును నిశ్శబ్దమునఁ గూర్చుండియుండిరి. నేఁడు వీరేంద్రసింహుని విచారణము చేయవలసి యుండెను. కృపాణహస్తు లగుభటులు వీరేంద్రుని సభారంగమునకుఁ గొనితెచ్చిరి. అతనిమొగ మొకింత భయ చిహ్నమైన లేక యెఱ్ఱనై యుండెను. కన్నులు నిప్పులఁ గ్రక్కు-చుండెను. నాసాపుటములు వికాళములై కంపించుచుండ నాతఁ డౌడుగఱచుకొని యుండెను.

కటులుఖా నాతనిం జూచి 'నేఁడు నీనేరము విచారింపఁ బడును. నీవుమాకు వ్యతిరిక్తుఁడవై యుండుట కేమికారణము?' అనియెను.

వీరేంద్రుఁడు కోపము నడంచుకొని 'నేను చేసినతప్పే దియో ముందుగఁ దెలియఁజేయుము' అనియెను.

ఖా—మాయానతి ననుసరించి నీవు ధనమును సైన్యమును పంపలేదేమి ?

వీ—నీవు స్వామిద్రోహివి. బందిపోటుకాఁడవు. నేనేల నీకు సాహాయ్యము చేయవలయును?

వీరేంద్రుని నిర్భయాలాపముం జూచి యందఱు నివ్వెర పడి యాతఁడు మరణమునకు జంకుట లేదని యనుకొనిరి. కటులుఖాను క్రోధకంపితుఁ డయ్యెనుగాని భావోద్రేకము నడంచుకొన నేర్పరియగు నాతఁడు తనకోపము నడంచుకొని

మృదుస్వరముతో 'మారాజ్యమున సామంతుఁడ వైననీవు మొగలాయీలకు సాయపడుట యేమి?' అనియెను.

వీ—నీకు రాజ్య మెక్కడిది?

కటుల్‌ఖాను కోపపరవశుఁడై 'దురాత్మా ? నీకింకను బ్రదుకుట కవకాశ మున్న దనుకొంటిని. నీదురభిమానమే నిన్ను ముంచివేయుచున్నది. అందులకుఁ దగినఫల మనుభ వించెదవు గాక' యనియెను.

వీరేంద్రుఁడు నిర్లక్ష్యభావముతో నవ్వుచు 'నే నెంత పట్టుపడియున్నను నీవంటివానిశరణము నపేక్షించువాఁడను గాను. ఈవిధముగాఁ బ్రాణముల నిల్పుకొనుటకంటెఁ జచ్చుటయే యుత్తమము. నామరణమే నీకుఁ బ్రియమైనయెడల నా ప్రాణములను మనఃపూర్వకముగ నీయెదుట విడిచిపెట్టెదను. కాని నీవు నాకును నావారికిని నపకీర్తిం గల్పించితివి. నాప్రాణమునకుఁ బ్రాణమును—నీవు—' అని పలుకుచుండఁగా నాప రాని దుఃఖాతిరేకమున నాతనికంఠస్వరము కంపించెను. భయ మన నేమియో యెఱుంగని మదవిక్రమసంపన్నుఁ డగునాతఁడు బాష్పాకులనయనుఁడై తలవంచుకొని పసిబిడ్డవలె నేడువఁ దొడఁగెను.

కఠినస్వభావుఁ డగుకటుల్‌ఖాను పరులకష్టములకు జాలిపడువాఁడు కాఁడు. జీవులంద ఱును దనవంటివారే యనుజ్ఞాన మాతనికి లేదు. కేవల శత్రుఁడగు వీరేంద్రుని యప్పటికష్టముఁ జూచి కటుల్‌ఖాను పరమానందవికసితనయనుఁడై 'వీరేంద్రా! నీకు నన్ను వేఁడగవలసిన కోరిక యేమైన నున్నదా? సమీపించి

యున్న మరణమునకు ముందే యాలోచించుకొని చెప్పుము" అనియెను.

వీరేంద్రుని హృదయతాపమునకుఁ గన్నీరే శాంతిదాయక మయ్యెను. ఆతఁడు కటులూ ఖానుం జూచి "నన్నతిత్వరితముగఁ జంపింపుము. ఇంతకంటె నా కేకోరికయును లేదు."

కటులూ—మంచిది—ఇంక నేదియైన.

వీ—నా కీజన్మమున నేమియును లేదు.

క—ఒక్కసారి నీకుమార్తెను కడపటిసారి చూడవలయునని లేదా?

విచారవదనములతో నిశ్శబ్దముగ నందఱును జూచుచుండిరి. వీరేంద్రుఁడు కన్నులనుండి నిప్పులు గురియుచుండ "పగిలిపోయిన హృదయగోళమునం దింకను పదాఘాత మెందులకు? నీకింకను సంతుష్టిలేదా? సరే. నీమనసు వచ్చినట్లు చేయుము. నేనీలోకమున దుర్బలుఁడనై పోయితిని. కాని దేవునియెదుటఁ బరలోకమున నిందులకుఁ దగిన సమాధానమును వినియెదవు గాక" అనియెను.

ఈపలుకులు కటులూ ఖానునిహృదయము నూచివలె పొడిచెను. పరలోకము—పరమేశ్వరుఁడు—అనుమాటలు వినఁబడినప్పు డెంతకఠిన హృదయమైనను గలఁగిపోకుండునా? కటులూ ఖానుఁడు తలవరివంకఁ జూచి "ఓరీ! ఇఁక నీవిధాయకకృత్యమును నెఱవేర్చుము" అని యాజ్ఞాపించెను.

సభయంతయు నిశ్శబ్దమయ్యెను. సభ్యులయుచ్ఛ్వాస నిశ్వాసములుకూడఁ గట్టువడిపోయెను. వీరేంద్రుఁడు వధ్యస్థానమునకుఁ గొనిపోఁబడుచుండెను. ఇంకను వీరేంద్రుఁ డచ్చటికిఁ

జేరకుండఁగనే యొకమహమ్మదీయుఁడు వచ్చి యాతనిచెవిలో నేమేమియో చెప్పి యొకయుత్తరము నాతని కిచ్చెను. వీరేంద్రుఁ డాయుత్తరమును జూచి విమల వ్రాసినట్లు గ్రహించి తోడనే దానిని నలిపి క్రిందఁ బారవైచెను.

"అది యాతని కుమార్తె వ్రాసియుండును" అని ప్రేక్షకులలో నొకఁ డనుచుండ వీరేంద్రుఁ డాలకించి "ఎవరు నా కుమార్తె యనుచున్నారు ? నాకీలోకమున నెవ్వరును లేరు" అనియెను.

మహమ్మదీయుఁ డాయుత్తరమును మరలఁ దీసికొని" తిరిగి నేవచ్చువఱకు నిరీక్షింపుఁడు" అని భటులతోఁ జెప్పి వెడలిపోయెను. ఆతఁ డస్మానుఖాను. కావుననే భటు లాతని యాజ్ఞననుసరించి నిరీక్షించుచుండిరి.

అస్మానుఖాను అంతఃపురమున నున్న విమలయొద్దకుఁ బోయి జరిగినదంతయును దెలియఁజేసెను. 'నిన్నుఁ జాలఁ గష్ట పెట్టుచున్నాను. నీవే మాకిట్టిగతి కల్పించితివి. కావున నందుకొఱకైన నీవు నాకీయుపకారము చేయకతప్పదు.' అని విమల ప్రార్థించెను.

అస్మాను మాఱుమాటాడకుండుటచే విమల కంపితస్వరముతో, "నీవట్లు చేయనిచో నాకిఁక దేవుఁడే గతి. న్యాయము నాతఁడే పాలింపఁగలఁడు" అనియెను.

అస్మా—అమ్మా! ఈపని యెంతదుష్కరమైనదో నీవాలోచించుటలేదు. ఇది కటుల్ఖానునకుఁ దెలిసిన నన్నురితీయింపక విడుచునా ?

విమ—ఏమి! కటులుఖాను నిన్ను రితీయించుటయా? అయ్యో! నన్నేల మోసగించెదవు?

అస్మా—ఆతనిసంగతి నీవెఱుఁగవు. సరే. అట్లయిననాతోరమ్ము?

ఇరువురును వధ్యస్థానమున కేతెంచిరి. వీరేంద్రుఁ డొక బ్రాహ్మణునితో మాటలాడుచుండుటచే విమలను చూడలేదు. విమల మేలిముసుగునుండియే చూచి యావిప్రుఁ డభిరామస్వామి యని తెలిసికొనియెను. వీరేంద్రుఁ డభిరామస్వామితో "ఆర్యవర్యా! నాకీలోకముతోఁ బనిలేదు. నేమనవి చేయవలసినదియును లేదు. నే నొకరికొఱకు పరమేశ్వరుని బ్రార్థింప నక్కఱలేదు. ఇదె నాయంత్యనమస్కారమును గైకొనుఁడు" అనియెను.

అభిరామస్వామి మేలిముసుగుతో నున్నవిమల నాతనికిఁ జూపించెను. అంతలో విమల వీరేంద్రునిచరణసమీపమున సాష్టాంగపడియెను. వీరేంద్రుఁడు గద్గదస్వరముతో "విమలా!" అని ప్రలపించెను.

విమల దుఃఖోద్రేకముతో "హా ప్రాణనాథా! ప్రాణప్రియా! ప్రాణధనమా! నా కింకను దాపఱిక మెందులకు? నన్నెవ్వరడ్డుకొనఁ గలరు? అయ్యో! ప్రాణేశ్వరా! నన్ను దిగవిడిచి పోయెదవా? పోయెదవా? ఎచ్చటకుఁ బోయెదవు?" అనియెను.

వీరేంద్రుఁడు కన్నులనుండి యశ్రుధారలు వరద వారుచుండ విమలను లేవఁదీయుచు "ప్రాణేశ్వరీ! విమలా! నాదృఢహృదయమున దుఃఖతరంగముల నుబికించుట కిదివేళగాదు. చావునకు జంకుచుంటి నని శత్రువు లనుకొనఁగలరు" అనియెను.

విమల యేమియును మాటాడలేదు. కొంతసేపైనతరు వాత వీరేంద్రుఁడు "హృదయేశ్వరీ! కడపటి సెల విమ్ము—నాతో నీవును వచ్చెదవా?" అనియెను.

విమ—ఇది సమయము కాదు. అంధకారబంధుర మగునీ లోకమున నాకింకను బగదీర్చుకొనుట కించుక వేచియుండ వలసి యున్నది.

వీ—స్వయముగనే?

వి—ఈచేతులతోనే. ఈహస్తాలంకారముల నిదే తీసివైచు చున్నాను. ఇఁక నివి నిశితాయుధములకంటె నెన్నఁడు నిట్టి యలంకారములను ధరియింపవు.

వీ—దైవానుగ్రహమున నీకవశ్యము జయమగుఁగాక.

ఆలస్యమగుచున్నదని తలవరి కేకవైచెను. వీరేంద్రుండు విమల నింటికిఁ బొమ్మని చెప్పెను. విమల శాంతనుయంబును బౌరుషసూచకంబు నగుస్వరముతో "ఏయశనిపాతముంబోని యసిపాతము నన్నునాథుఁగఁ జేయనున్నదో దానిని గన్నారఁ జూచి కాని నే నీస్థానమును విడువను. నీవెచ్చనినెత్తురుతో నాహృదయసంశయములఁ దుడిచివేయవలయును" అనియెను.

సరేయని వీరేంద్రుఁడు తలవరివంకఁ జూచెను. తలవరి కరవాలమును బైకెత్తెను. సూర్యకిరణముల మిలమిల మెఱయు నాకృపాణముం గాంచి విమలయొక్కసారి కన్నులు మూసెను. ఆమూసినకన్నులు తెరచునప్పటికి రక్తసిక్త మగు వీరేంద్రుని శిర మామెకడఁ బొరలాడుచుండెను.

విమల రాతిబొమ్మయైపోయెను. ఆమె నేత్రముల నొక్క కన్నీటిచుక్కయైన లేదు. ఆమె నిశ్చలదృష్టు లాశిరస్సునందే లగ్నమైపోయెను.

---

## అయిదవ ప్రకరణము.

ఎచ్చటనైన నెప్పుడైన నెవ్వతెయైన నంపకర్త యగు యువతీమణి దొరకినచోఁ దనకొఱకుఁ బంపవలయునని కటులూ ఖానుని యాజ్ఞయున్నది. మందరగడ స్వాధీనమయినమరు నాఁడు కటులూఖాను కారాగృహమునయున్నవారిని విచారించుచు నందగపడిన విమలాతిలోత్తమలను తననగరునకుఁ బంపివైచెను. కాని యావశ్యకంబులగు నితరకార్యములం జిక్కుకొనియున్న కటులూఖానునకు నూతనముగ లభియించిన విమలాతిలోత్తమలతో వినోద మనుభవించుట కవకాశము గలుగలేదు.

ప్రకృతిపరిణామ మెంతవిచిత్రమైనది. దయ యనుమాట లేక నిరంతరము విడువక తిరుగుచుండు నదృష్టచక్రపరిభ్రమణ వేగంబున "లావణ్యము, తారుణ్యము, శీలము మొదలగు నన్నియుఁ బేరులేకుండఁ బోవుచుండును. విమలాతిలోత్తమ లిప్పుడు ప్రత్యేకమందిరముల నుంపఁబడి యుండిరి. పాపము! దిక్కుమాలిన తిలోత్తమ కుసుమకోమలం బగుశరీరము కటికి నేల ధూళిధూసరితమై పడియున్నది. మన మామెకొఱకు జాలి పడి యేమి చేయఁగలము. కటులూఖానింటఁ జిక్కియుండె నను నపకీర్తికి జంకి మానఘనుఁడగు వీరేంద్రుఁడు మరణసమయ

మునఁగూడ నామెను జూడఁగోరలేదు. విమల వ్రాసినయుత్త రముగూడఁ జదువలేదు. ఇఁకఁ దిలోత్తమ నెవ్వరు చూతురు!

విమల సంతోషము సాహసము చాతుర్యము చాక చక్యము ఇవి యన్నియు నెక్కడకో పోయినవి. ఆమె తన మొగము పైఁటచెఱఁగునఁ గప్పికొని దుఃఖించుచున్నది. ఆమె వినీలకుంతలములు ధూళిదూసరితములై యున్నవి. నగ లన్నిటిని దీసివైచి మాసినచీరలం దాల్చియున్నది. ఆమె చూపులలో నిగనిగలేదు. కన్నులుచ్చిపోయినవి. పాప! మిప్పుడు విమల విధవయైపోయినది. ఇప్పుడు విమల యస్మానునిరాకకై చూచుచున్నది.

యుద్ధమనినఁ బండుగగాఁ దలంచుచు నిరంతరవిజయ శాలి యగు నస్మానుం జూచి పఠాను లందఱును గర్వపడవలసి నదే. ఆతఁడు రణంబునఁగాని రణాంతరమునఁ గాని యెట్టి పాపకార్యములను చేయఁజాలఁడు. కటుల్‌ఖానునివలన విమలా తిలోత్తమల కట్టి దుస్థితి కలిగినది. అస్మాను వారిని సంరక్షిం చుటకై తెచ్చెనుగాని వేఱొండుగాదు. విమల వీరేంద్రుని భార్య యని తెలిసికొని యాతఁడు చాల నొచ్చుకొనియెను. కటుల్‌ఖానున కాతఁడు మేనల్లుఁడగుటచే నగరులోనికి వచ్చుచుఁబోవుచుండుట కవకాశమున్నది. అందువలననే యాతఁడు విమలను వీరేంద్రునొద్ద కొకసారి తీసికొనిరాఁ గలి గెను. ఆరాజ్యమున సేవకుఁడు మొదలు మంత్రివఱకు నాతని గౌరవించుచుందురు. ఆతని బాహుబలంబుననే కటుల్‌ఖానుని రాజ్యమామోదరానదివఱకును వ్యాపించినది. అందుచే నందఱు నాతని బ్రభువుంబోలి గౌరవించుచుందురు.

రెండుదినములైన తరువాత విమల తన నగలన్నియును బరిచారిక కిచ్చి యామెమూలమునఁ దన కింకొకసారి దర్శన మీయవలయునని యస్మానునకుఁ గబురు పంపెను. తఱచుగ నే వచ్చుచుండుట యపాయకరమనియు నీవు మాయింటికి వచ్చి నన్నుఁ జూడవచ్చుననియు నందులకుఁ దగినయుపాయము చేసితి ననియు సమాధాన మంపెను. అయేషా పరిచారికవచ్చి కొజ్జాలతో నేమోచెప్పి విమల నస్మానునొద్దకుఁ గొనిపోయెను.

అ—ఇంకను నేనేమి చేయవలయును?

వి—ఒక చిన్న పని యున్నది. జగత్సింహుఁడు బ్రతికి యున్నాఁడా?

అ—బ్రతికియున్నాఁడు. ఆతఁడు గాయములచే మంచము పయియుండుటచేఁ గారాగృహమునకుఁ బంపఁబడలేదు.

వి—అయ్యో! మందభాగ్యుల మగుమాసంబంధ మున్నంత వఱకు నందఱు నశ్లేయున్నారు. ఏమిచేయఁ గలము? అయ్యో! ఆతఁడు నెమ్మదిపడిన తరువాత నీయుత్తర మాతని కిప్పింపవలయును. ఇదియే నావిన్నపము.

అస్మా—ఇది నావలనఁగాదు. మన్నింపుము. ఇప్పు డెట్లున్నను జగత్సింహుఁ డపరాధిగనే భావింపఁబడుచున్నాఁడు. సంగతి తెలియకుండ నీయుత్తరమాతని కిచ్చుట మంచిదికాదు. ఇది రాజాజ్ఞకు వ్యతిరేకము.

వి—ఈజాబు విషయమున నీవు సందేహింప నక్కఱలేదు. రాజాజ్ఞకూడ నీ వంటివానిని బాధింపదు. నీవే ప్రభుఁడవు.

అ—ఈవిషయమునఁ బ్రభుశాసనము నతిక్రమింపఁ జాలను. ఈపనిలో మాత్రము నీకుఁ దోడుపడఁ జాలను.

వి.—ఉత్తరమంతయుఁ జదివి చూడవచ్చును. తరువాత నీయిష్టము—

ఇట్లు విమల యతివిచారముతోఁ బలుకుటయు నస్మానుఖాను జాబునందుకొని చదువఁ దొడంగెను.



## ఆ ఱ వ ప్ర క ర ణ ము.

రాజపుత్రా!

ఎప్పుడో యొకప్పుడు నాజీవచరిత్రమును నీకు విన్నవింతునని నేనొకనాఁడు నీతో మనవిచేసియుంటిని. అందులకుఁ దగినసమయము వచ్చినది. అంబరుప్రభుండ వగునీకుఁ దిలోత్తమ యర్ధాంగలక్ష్మి యైనప్పుడు నాచరిత్రమును విన్నవింపవలయునని వేఁడుకపడితిని కాని విధివైపరీత్యమున నట్టినాయాశ యడుగంటిపోయినది. విమలాతిలోత్తమ లీప్రపంచమును వదలిపోయిరని నీవు కొలఁదిదినములలోనే వినఁగలవు. కావుననే నీకిప్పుడీ జాబువ్రాయవలసి వచ్చినది. పాపాత్మురాల నగు నేను నాజీవితకాలమునం దెన్నియో పాపకార్యములఁ జేసితిని? నామరణానంతరమునఁ బ్రజలు నాపై నెన్నియోతప్పుల నారోపించి నన్ను నిందింపక మానరు. అట్లు రానున్ననాయపయశము నడంచుట కీలోకమున నాకుఁ గావలసినవా రెవ్వరున్నారు?

అభిరామస్వామి యున్నాఁడు గాని యాతనిమూలమునఁగూడ నాకుపకారము కాఁజాలదు. ఆతఁడును గొలఁదిదినము

లలోఁ బ్రాపంచికసంబంధమును వ్యజియింపఁ గలఁడు. రాకుమారా! ఎప్పటికైన నీబాంధవము నాశించి యున్న నన్ను నీకుఁ గావలసినదానిగా నెంచుకొనవలయునని ప్రార్థించుచున్నాను. ఏమని చెప్పుదును? ఒక్కమనవి—విమల వీరేంద్రునిపరిచారికగ నున్న భోగినియనియు, జారిణియనియు లోకు లనుకొను నప్పుడు "కులమునకుఁ దక్కువై దురదృష్టవతి యగువిమల నేమనిన ననుకొనుఁడు కాని యామె జారిణిమాత్రము కాదు" అని లోకమునకు సమాధానము చెప్పుము.

స్వర్గస్థుఁ డగువీరేంద్రుఁడు విధ్యుక్తముగ నన్నుఁ బెండ్లియాడినాఁడు. ఎన్నాళ్లనుండియో గూఢముగ నున్న యీవిషయమును గూర్చి యెవ్వరు నమ్ముదురు? నేనాతనిని యర్ధాంగివలె నుండక పరిచారికవలె నుండుట కేమికారణమో చెప్పెదను వినుము.

మందరగడమునకు సమీపమున నొకపల్లెయందు శశిశేఖరభట్టను నొకబ్రాహ్మణుఁడు కలఁడు. ఆతనితండ్రి మిగుల శ్రీమంతుఁడు. శశిశేఖరునకు వయసువచ్చుసరికెల్లవిద్యలును వచ్చెను. ఆతఁడు గుణవంతుఁడే గాని యౌవనవికారమున విషయలోలుఁ డయ్యెను. అందులకుఁ దోడు జయధారసింహుని కుటుంబమువాఁ డగు నొకరాజకుమారుఁడు చక్రవర్తిసేనలోఁ జేరఁ బోవుటచే నాతనిభార్య ప్రియవిరహమును సహింపక కామవికారమునకు లోనై శశిశేఖరునితో విచ్చలవిడిగ సంచరింప సాగెను. పాపము బ్రద్దలు కాకమానదు. కొలఁది కాలము ననే యామెకు గర్భము నిలిచెను. ఇంకొకవంశమునకుఁ దన తనయునివలనఁ గళంకము కలిఁగినందులకు శశిశేఖరునితండ్రి,

చాల విచారించి త్వరలో నింటికి రావలయు నని యామెభర్త కుత్తరము వ్రాసెను. కుమారుని మందలించెను. శశిశేఖరుఁడు సిగ్గుపడి కాశికానగరమునకు లేచిపోయి యొకశూద్రస్త్రీయింట విడిసియుండి విద్యానిధి యగుపండితునొద్ద విద్యాభ్యాసము చేయుచుండెను. ఆకాపుదాని కొకకూఁతురు గలదు. ఆమె యాతని కుపచారములు చేయుచుండెడిది. క్రమముగ నాయి రువురకును మనసులు కలసిపోయినవి. కులగౌరవములు సలుప వలసిన యాకాపుబిడ్డ పెండ్లిగాకుండఁగనే యాబ్రాహ్మణునకు వశమై పోయెను. ఆమెయును గర్భవతియై నన్నుఁ గన్నది. ఈ సంగతి విని తండ్రి కోపించి శశిశేఖరుని బహిష్కృతునిగాఁ జేసెను. పరాభవదుఃఖమున శశిశేఖరుఁ డానగరమును విడిచి పోయెను. కులభ్రష్టయగు మాతల్లి యిలువెడలఁ గొట్టఁబడి యెను.

మందభాగ్య యగుమాయమ్మ నను వెంటఁబెట్టుకొని యొకయింటఁ బ్రవేశించి కాయకష్టముచే దినములఁ గడపు కొనుచుండెను. మాకెవ్వరును సాయపడుట లేదు. మాతండ్రి మాట తెలియుటయే లేదు. ఒకనాఁ డొకపఠానుఁడు కుటుంబ ముతో డిల్లీకిఁ బోవుచుఁ గాశీనగరమునఁ బ్రవేశించెను. హిం దువు లెవ్వరు నాతనికి నిలుచుటకుఁ దావీయలేదు. హేమంత ఋతు వగుటచే నాతనిపిల్లలు చలికి వడకిపోవు చుండిరి. చాల రాత్రి యైనది. అప్పు డాతఁడు మాయింటికి వచ్చి మాయమ్మ నారాత్రినించుక చోటిమ్మని కోరెను. బహుమానముకూడ నిచ్చెద ననియెను. మృదులహృదయ యగుమాయమ్మ యాపిల్లల కష్టమును సహింపఁజాలక వారికిఁ దనయింట నిలువ నీడయొసం

గెను. ఆపఠానుఁడు సంతోషముతో దన పెండ్లాము బిడ్డలను మాయింటికిఁ దెచ్చి యొకభాగమున విడిసియుండెను. ఇంకొక పైపున మే ముంటిమి. ఆదినములలోఁ దఱచుగా దొంగలు బిడ్డలనెత్తికొని పోవుచుండిరి. అప్పటికి నే నాతేండ్లపిల్లను. నాఁడు జరగినసంగతి మాయమ్మవలన విన్నది విన్నట్లు చెప్పుచున్నాను. రెండుజాములవేళ నొకదొంగ కన్నముత్రవ్వి మాయింటఁ బ్రవేశించి యాపఠానుకుమారునెత్తికొని పోవుచుండెను. మెలకువతో నున్న నేను దీపమువెలుఁగునఁ జూచి 'దొంగ దొంగ' యని కేకవైచితిని. అందఱకును మెలకువ వచ్చినది.

పఠానునిభార్యకుఁ బ్రక్కనున్నబిడ్డ యగపడలేదు. ఆమె కెవ్వునఁ గేకవైచెను. బిడ్డనెత్తుకొని దొంగ పాఱిపోయెను తోడనే పఠానుఁ డాతనివెంబడించి పరువెత్తి పట్టుకొనియెను. దొంగ యిఁకఁ జేయునది లేక రక్షింపు మని వేఁడుకొనియెను పఠానుఁడు తనబిడ్డను దీసికొని దొంగను చెవిగోసి విడిచిపెట్టెను.

అంతవఱకుఁ జదివి అస్మాను కొంచెమునే పాలోచించి 'విమలా! నీ కింకొక పేరున్నది కాదా?' అనియెను.

విమ—ఉన్నది. మాతండ్రి దానిని మార్చి విమల యని పేరు పెట్టినాఁడు.

అస్మాన్—నీమునుపటిపేరు మహరు కాదా?

వి—ఔను. నీకెట్లు తెలిసినది?

అస్మాన్—ఆపిల్లవాఁడను నేనే.

విమల వింతపడియెను. అస్మాను మిగిలియున్న జాబు చదువ నారంభించెను.

"మరునాఁడు పఠానుఁడు ఢిల్లీకిఁ బోవుచు మాయమ్మం జూచి 'నీబిడ్డ మాకెంతో యుపకారము చేసినది. మేము నీబుణము తీర్చికొనఁజాలము. మేము ఢిల్లీకిఁ బోవుచుంటిమి. అక్కడ నీకేమైనఁ గావలసిన పనులున్నచో నెఱింగింపుము. నీకు వలసినంతసాయము చేయుదును. నీవు ధనముఁ గోరినచోఁ గావలసినంత పంపెదను' అనియెను. అందులకు మాయమ్మ 'నాకు ధనము వలదు. ఏదో యొకవిధముగ నాకాలముగడచుచున్నది. మీకు రాజుగారిపరిచయ మున్నయెడల దయయుంచి యీ బాలికతండ్రి యెందుండెనో తెలిసికొనుటకుఁ దగినసదుపాయములఁ జేయింపఁగోరెదను' అనియెను. పఠానుఁ డందులకు సమ్మతించెను. మాయమ్మకుఁ గొంతసొమ్మీయఁబోయెను గాని యామె తీసికొనలేదు. పఠానుఁడు ఢిల్లీకిఁ బోయి మాతండ్రిని వెదకుటకుఁ దగినయేర్పాటులను గావించెను. కాని పర్యవసానము తేలలేదు. మఱి పదునాలుగేండ్లకు మాతండ్రి యభిరామస్వామి యని పేరుపెట్టుకొని ఢిల్లీలో నున్నట్లు తెలియవచ్చినది. అప్పటికప్పుడే మాయమ్మ యీలోకము విడిచి పోయినది. సదాచారవిరుద్ధముగఁ బెండ్లాడిన సతీమణులకు స్వర్గవాసయోగ్యతయున్నయెడల మాతల్లి స్వర్గమున నుండెనని చెప్పవచ్చును.

మాతండ్రి సంగతి తెలిసినది. మాయమ్మ మరణించినది. నాకుఁ గాశితోఁ బనియేమున్నది? నా కీలోకమున మాతండ్రి యొక్కఁడే దిక్కనియెంచి నే నాతనియొద్దకుఁ ఢిల్లీకిపోయితిని.

నన్నుఁ జూచి మొదట నాతఁ డసహ్యపడియెను గాని తుట్టతుదకు నాప్రార్థనమన్నించి నాకు విమల యని పేరుపెట్టి తనపరిచారిగాఁ జేసికొనియెను. యథావిధిగ నాతండ్రికి నే నుపచారములు చేయుచుంటిని. క్రమక్రమముగ నాతనికి నాపైఁ బ్రేమ యుదయించినది. నే నాతనికిఁ దనూజాతనుగదా!



ఏడవ ప్రకరణము.

రాజకుమారా! మాతల్లి వలె మాతండ్రిమూలమున గర్భవతియగు నింకొక కాంత మందరగడమున నున్నట్లు చెప్పియుంటిని. ఆమెకును మాతల్లిగతియేపట్టినది. కొలఁదిదినములలో నామెయు నొకయాఁడుబిడ్డను బ్రసవించెను. కఠినశైలములపైఁ గుసుమలతలు పుట్టుచున్నవి. చీకటిగనులలో దివ్యరత్నములు దొరకుచున్నవి. ఆ పేదరాలిగర్భమునం బుట్టినయాఁడుబిడ్డ త్రిలోకసౌందర్యవతి యని ప్రసిద్ధికెక్కెను. కాలవశమున నాయువతి యపవాదమును మాసిపోయెను. దైవయోగమున నాబిడ్డయే వీరేంద్రుని యిల్లాలయ్యెను. తిలోత్తమనుగన్నతల్లి యామెయే.

ఒకప్పుడు వీరేంద్రుఁడు ఢిల్లీకి వచ్చెను. శిష్యుఁడగునాతనిని మాతండ్రి మాయింటికిఁ దీసికొని వచ్చెను. ప్రథమదర్శనమునకు నామన సాతనివశమై పోయినది. అదిమొద లాతఁడు తఱచుగ మాయింటికి వచ్చుచుండెడివాఁడు. వివిధవిషయములనుగూర్చి నాతో మాటలాడుచుండెడివాఁడు. క్రమక్రమముగ నాహృదయము కరఁగిపోవుచుండెను. ఒకరిభావ మొకరికిఁ దెలిసిపోయినది. నన్నాతఁ డపేక్షించుట లేదు. ఆతని

యానాఁటిమధురవాక్యములు దివ్యవీణాస్వనములవలె నాశ్రవణములం దింకను బ్రతిధ్వనించుచున్నవి. నే నాతని నెంతయో వలచితిని. ప్రేమించితిని. అయినను నాతల్లిపడినపాటులు నే నెఱింగినదాన నగుటచే నాకన్యాత్వము నాతనివశము చేయుటకు సంశయించుచుంటిని. అతఁడు తొందరపడుచుండెను. ఈ సంగతి మాతండ్రి గ్రహియించి వీరేంద్రునితో 'నేను విమలను విడిచి యుండలేను. నీ వీమెను పెండ్లియాడినచో నీయొద్ద నుందును' అనియెను. శూద్రకన్య యగువిమలను నేఁ బెండ్లియాడనని వీరేంద్రుఁడు చెప్పెను.

అభి—నీపెద్దభార్య జారిణీతనయ కాదా?

వీరే—ఆసంగతి నాకు మొదటఁ దెలియదు. అయినను నీపెద్ద కూఁతురు శూద్రకాంత కాదు.

అభి—నీవు విమలను పెండ్లాడినచో నిచ్చటకు వచ్చుచుఁ బోవుచుండ తగదు. ఇంతటినుండి నీకడకు నేనే వచ్చుచుందును.

వీరేంద్రుఁ డప్పటినుండియు మాయింటికి వచ్చుట మానుకొనియెను. నే నాతనికొఱకుఁ బరితపించుచుంటిని. అది యాతనికిని గష్టముగనే యుండెను. కొన్నాళ్లకాతఁడు మరల వచ్చుట మొదలుపెట్టెను. సిగ్గు విడిచి మునుపటికంటె నతి ప్రియముగ నేనాతనితో మాటలాడుచుంటిని. ఇదియంతయుఁ జూచి మాతండ్రి యొకనాఁడు నన్నుఁ బిలిచి 'విమలా నేను సన్యాసినిగదా. నాకెచ్చటికైనఁ బోవలసినప్పుడు నీవొక్కతెవు నెచ్చట నుందువు' అని యడిగెను. నేనుగూడ నీతోనే వచ్చె

దనని చెప్పితినిగాని యంతలో నాప్రియునిమాట జ్ఞప్తికివచ్చుటచే 'నన్నుఁగాశిలో నుంచినను సరియే' అని చెప్పితిని.

మాతండ్రి యందుల కంగీకరింపలేదు. నేను సంచారమునకుఁ బోయినప్పుడు నీవు మానసింహుని రాణియొద్దఁ బరిచారికగా నుండుమని చెప్పెను. నాయనా! నన్ను విడిచి పోయెదవా అని నే నేడ్చితిని.అంత మాతండ్రి 'కొన్నాళ్లవఱకు నేనిచ్చటనే యుందును. నీవంతఃపురమున నున్నప్పుడు దినదినమును వచ్చి నిన్నుఁ జూచుచునే యుండెదను' అని యూఱడించెను. ఈవిధముగా నాతండ్రి నన్ను వీరేంద్రునికన్నుల నుండి తప్పించెను.

రాజసింహా! మాతండ్రియాజ్ఞచే మీభవనమున నేను కొన్నాళ్లుంటిని. నీవప్పటికిఁ బదియేండ్లవాఁడవు. అప్పుడు నీవు మాతల్లియొద్ద నంబరునగరమునం దుంటివి. నేను నీసవతితల్లిపరిచారికనై ఢిల్లీయందుంటిని. ఆమె పేరూర్మిళ. ఆమె నన్నుఁ బరిచారికఁగా భావింపక సోదరివలె నాదరించినది. అచ్చటనే నెన్నియోవిద్యల నభ్యసించితిని. కుట్టుపని, సంగీతము, నృత్యము మొదలగునవి నా కక్కడనే లభియించినవి. చదువుటయు వ్రాయుటయు నేనచ్చటనే నేర్చితిని. ఆమెమూలముననే నాకు మానసింహునితోఁ బరిచయ మైనది. మహారాజు నాబుద్ధిసూక్ష్మతకును గానాభినయవిశేషంబులకును మెచ్చుకొనుచు నన్నుఁ దనకుటుంబములోనిదానిగా నాదరించుచు నన్నుఁ జూడవచ్చు నాతండ్రిని మిగుల మరియాదతోఁ జూచుచుండెడివాఁడు.

నేనచ్చట సుఖముగనే యుంటిని గాని నామనోహరుఁడు నా కగపడుట లేదు. అతనికి నాసర్వస్వమును నాప్రాణ

ముతో సమర్పించుకొనియుంటిని. అతఁడును నన్ను మఱచి పోలేదు.

అట్టిప్రాణప్రియుని వియోగము నన్ను బాధించు చుండెను. క్రమముగా నేనాస్మానీతో స్నేహము చేసితిని. ఒక యుత్తరమువ్రాసి యామెమూలమున నామనోహరమునకుఁ బంపితిని. ఆతఁడును నాకుఁ బ్రత్యుత్తర మిచ్చెను. ఏమని చెప్పను. అప్పటినుండి కొంతకాలమువఱకు మాప్రేమ రసతరంగిణి యుత్తరప్రత్యుత్తరములమార్గమున నిరంకుశముగఁ బ్రవహించి పోవుచుండెను.

మూఁడేండ్లయిపోయినవి. నాప్రాణేశ్వరుఁడు నావియోగమును సహింపలేక పోయెను. ఒకనాఁటిరాత్రి నాయింట నేనొంటిగఁ బరుండి నిద్రించుచుండఁగా నాతఁడు నాయొద్దకు వచ్చెను. నాకు మెలకువ వచ్చినది. కన్నులు విచ్చి చూచితిని. ఏమని చెప్పను? చిరకాలమునకైన ప్రియదర్శనము! నా కొడలు తెలియ లేదు. నాప్రియుని బిగియారఁ గౌఁగిలించుకొంటిని. కొంతసేపటికి నాకుఁ దెలివి వచ్చినది. నాకు భయమయ్యెను. ఈ యంతఃపురమున కెట్లువచ్చితి వని నాప్రియు నడిగితిని. అస్మానీసహాయమున నీళ్లు మోయువానివేషముం దాల్చివచ్చితినని నానాథుఁడు చెప్పెను. నాయొడలు వడఁకి పోవుచుండెను. ఇఁక ముందు సంగతి యేమి చేయవలయునని యాలోచించుచుంటిని. ఇంతలో నాగదితలుపు తెఱచిన చప్పుఁడయ్యెను. మానసింహుఁడు మాయెట్టయెదుటఁ బ్రత్యక్షమయ్యెను.

ఇంకఁ జెప్పవలసిన దేమున్నది. నా ప్రియుని బలవంతముగఁ బట్టి తీసికొనిపోయెను. అప్పటి నాయవస్థ యూహించుకొనవలసినదే గాని వ్రాయుట కనుపడునది కాదు. తత్క్షణమ నేనూర్మిళయొద్దకుఁ బోయి పాదములపైఁ బడి ప్రార్థించితిని. తప్పింతయును నాపైఁ బెట్టుకొని రక్షింపుమని వేడుకొంటిని. మాతండ్రినిగూడఁ బ్రార్థించితిని. మానసింహునితో మనవిచేసి నానాథుని విడిపింపవలయునని కోరితిని. ఆతఁడు నన్ను క్షమించునని నమ్ముకొంటిని గాని యట్లు చేయలేదు. ఆతనికిఁ గోపము వచ్చెను. "ఛీ దుర్మార్గురాలా! నీకు సిగ్గులేదా" అని నన్ను నిందించెను.

నాదుఃఖముం గాంచి యూర్మిళ చాల జాలిపడియెను. నా కుపకారము చేయవలయు నని మానసింహుని వేఁడుకొనియెను. "విమలను పెండ్లాడినచో నే నాతని మన్నించెదను." అని మానసింహుఁడు చెప్పెను. ఆ మాటయే రాజసింహుఁడు నానాథునియొద్దఁగూడ ననియెను. నానాథుఁడు మండిపడి "కలకాలముఁ జెఱయందైన నుండి ప్రాణముల విడిచెదను. కాని నేనాశూద్రస్త్రీని బెండ్లియాడను. రాజపుత్రుఁడవగు నీవిట్లుచెప్పుట మరియాదకాదు" అనియెను. "నేను నాసోదరిని మహమ్మదీయున కీయలేదా? బ్రాహ్మణతనయను నీవు పెండ్లియాడుట కేమి యభ్యంతరము." అని చెప్పెను. నానాథుఁ డందులకంగీకరింపలేదు."అయినదేమో యైనది. నన్ను విడిచి పెట్టినచో నిఁక విమలమాటనైనఁ దలంపను." అని పలికెను. అప్పుడు మానసింహుఁడు. 'నీతప్పునకుం దగిన ప్రాయశ్చిత్తము కావలదా? నీమూలమున విమల కులభ్రష్టయై పోవలసినదా?' అని

యడిగెను. ఆతఁడు మారు మాట చెప్పలేదు. మానసింహుఁ డాతని నెంతయో బలవంతపఱిచెను. తుదకు మానసింహుఁడు 'విమల నాయింటి దాసివలె నుండవలయును. ఈ పెండ్లివిషయమై యెన్నఁడు నాకు స్మృతిగలిగింపఁ గూడదు. ఆమె యెన్నఁడును తాను వీరేంద్రునిభార్య నని చెప్పుకొనఁగూడదు ఇందులకు విమల యంగీకరించినచో శూద్రవనితయైనను నీబలవంతముచే నేనామెను బెండ్లియాడెదను.' అనియెను.

మానసింహుఁడు నా కీసంగతుల నన్నిటిఁ దెలియఁజేసెను. ఆనందముతో నే నంగీకరించితిని. నాకు భాగ్యముతోఁ గాని పేరుతోగాని ప్రసక్తిలేదు. నాకుఁ గావలసినవాఁడు నామనోహరుఁడే. నాయంగకారమునకు మాతండ్రియును సమ్మతించెను. తోడనే నా వివాహమైనది. కాని నేను నా ప్రియుని గృహంబున దాసిగనే యుంటిని. శోకమూలమున ననుమానము గలుగుటచే నాథునకు నాపైఁగల పూర్వప్రేమ యంతయు నంతరించిపోయెను. కొంతకాలమువఱకు నాతఁడు నన్నసహ్యముగఁ జూచుచుండెను. ఆతఁ డేమి చేసినను నేను సహించుకొనుచుంటిని. అదృష్టవశమునఁ గొన్నాళ్ల కాతనికి మరల నాయం దెప్పటి యనురాగము గుదిరినది.

రాజపుత్రా! ఇంక విశేషించి వ్రాయునది లేదు. నా వివాహకారణముననే నాథుఁడు మానసింహునిపై దీర్ఘక్రోధమును విడువఁ డయ్యెను. ఆతనివలనం గలిగినపరాభవమాతఁడు తనజీవితకాలమున మఱచిపోలేదు. ఆదీర్ఘక్రోధమే యిన్నికష్టములకుఁ గారణమైనది. ఇఁక నాపని యైపోయినది. ఒక్క మనవి. నేను కులటనై మందరగడమున వీరేంద్రునికడ

నుంటినని ప్రజలు చెప్పుకొందురు. నామరణానంతరము నా కగౌరవము కలుగకుండ నీవు కాపాడఁగలవని నేను నమ్ముకొనియుంటిని. నీ కీయుత్తర మందుకొఱకె పంపితిని. ఇందు నావిషయమును మాత్రమే వ్రాసితిని. ఎవ్వరికొఱకు నీవాత్ర పడుచుంటివో యామెనుగూర్చి యెంతమాత్రమును వ్రాయనేలేదు. ఈలోకమున నామెపేరే లేకుండఁబోయినదని తలంపుము. ఆమె బ్రదికియున్న దనుసంగతియే మఱచిపొమ్ము."

అస్మా నా యుత్తరమంతయును జదివి 'నాప్రాణములనే కాపాడిన నీఋణము నేనెట్లు తీర్చికొనఁగలను.' అనియెను. విమల నిట్టూర్పువిడిచి 'నీవేమి చేయఁగలవు?' అనియెను. 'అస్మాను తనవ్రేలియుంగరమును దీసి విమల చేతికిచ్చి 'ఒకటి రెండుదినములలో నేనేమియు చేయలేను. కటులుఖాను జన్మదినము వచ్చుచున్నది. ఆదినమున నందఱును సంతోషముతోఁ ద్రాగి యొడలు మఱచి యుందురు. ఆరాత్రి నీవంతఃపురద్వారముకడ నిలిచి యుండుము. అప్పు డొకపురుషుఁడు వచ్చి నీకిట్టియుంగరమునే చూపును. నీవాతనివెంటనే పొమ్ము. నీవొక్కతెవే పొమ్ము. మఱియెవ్వరిని రానీయవలదు. భగవంతుఁడు నిన్ను రక్షించుఁగాక.' అనియెను.

విమల మాటలాడలేకపోయెను. తిలోత్తమను దీసికొని పోరాదని యాతని యభిప్రాయమైనట్లు గ్రహించెను. ఇద్దఱము బోవుటకు వలనుపడదేని తిలోత్తమనే పంపివైచెదనని నిశ్చయించుకొని యాతనియొద్ద సెలవుదీసికొని వెడలిపోయెను.



భాగము.

## ఎనిమిదవ ప్రకరణము.

కాలమునకు నిలుకడ లేదు. అది యెప్పుడు నొక్క రీతిగఁ బరుగెత్తుచుండును. దాని గమనవేగమునఁ గష్టసుఖ పరంపరలు పొడసూపుచుండును. కష్టపడుచున్నను సుఖపడుచున్నను దినములు గడచిపోవుచుండును. అట్టి దుస్థితిలో నున్న విమలాతిలోత్తమల దినములును గడచిపోవుచునే యున్నవి. విమల పగఁ దీర్చికొన నుద్దేశించియున్నది. ఆయుద్దేశ మామెను ప్రతిక్షణము బాధించుచునే యుండెను. అట్టిక్షణములు దినమునం దెన్నియుండును. అట్టిదినము లెంతదుస్సహములుగా నుండును. విమల కన్నులయెదుట నట్టి కష్టదినములుకూడఁ దిరిగిపోవుచున్నవి. విజయుఁడగు కటుల్ ఖానునకును, వ్యాధిపీడితుఁ డగు జగత్సింహునకునుగూడ దినములు గడచిపోవుచున్నవి. ఎవ్వరిదినములు శాశ్వతముగ నిలిచియుండును.

జగత్సింహునకుఁ గ్రమముగ నారోగ్యము కలుగుచుండెను. ఆతనికిఁ దిలోత్తమ యగుపడుట లేదు. ఆతఁడా మెంగూర్చి యగపడినవారినెల్ల నడుగుచుండెను. ఎవ్వరును సమాధానము చెప్పుట లేదు. ఆతని సర్వాంగకములును, హృదయమునుగూడఁ బరితపించిపోవుచుండెను. ఇఁక ముందు మాట యేమని యాలోచించెను. ఆతని కేమియును తోఁచుట లేదు. అయేషాయును అస్మానును తమశక్తియంతయు నుపయోగించి యాతనికిఁ గారాగృహవాసము లేకుండఁ జేసిరి. ఆతఁడు దివ్యభవనముననే యుండెను. అయేషా సోదరివలె నాతని కుపచారములఁ జేయుచుండెను. ఎందఱో పరిచారికలు

పని చేయుచుండిరి. ఆతనికేమియును గొడవలేదు. అయినను రక్షకభటుఁడు ద్వారముకడ నుండి యాతని గాచికొనియే యుండెను. ఫలభక్ష్యముల నారగించుచు బంగారుపంజరమున నున్న చిలుకవలె నాతఁ డామందిరమునం దుండెను. ఆకారణమున నాతనికి స్వేచ్ఛ యొక్కటిమాత్రము లేదు. ఆతని సైనికు లేమైరో వెలుపల నేమి జరగుచున్నదో యాతనికి గోచరించుట లేదు. దయాస్వరూపిణి యగునయేషా తన కంతటి ప్రేమతో నేల యుపచారములు సేయవలయునో యాతనికి బోధపడుట లేదు.

అయేషా విశ్రాంతి యెఱుంగక శ్రమను బాటింపక దానివలె నప్రమత్తయై యాతనిసేవ చేయుచుండెను. ఆమెకు నిద్రాహారములు లేవు. దయారాశియై ప్రేమస్వరూపిణియై శాంతిమతియై మనోహారిణియగు నొక దివ్యసుందర విగ్రహము నిరంతరము మనసువచ్చినరీతి సేవించుచున్నప్పు డెట్టిరోగికైనను బాధయనుమాట తలంపునకైన వచ్చునా? అప్పటి యాతనిస్థితి యనుభవైకవేద్యమే కాని వేఱు కాదు.

జగత్సింహునకు జబ్బు కుదురుచున్నకొలఁది నయేషా రాకపోకలు తగ్గుచుండెను. ఆతనికిఁ బూర్తిగ నారోగ్యము కలుగునప్పటి కామెదర్శన మపరూపమైపోయెను. అప్పు డప్పుడు క్షేమసమాచారములు తెలిసికొనుటకు మాత్రమే యామె వచ్చుచుండెను. జగత్సింహుఁడు నిర్బంధావరణమున నున్న స్వేచ్ఛ ననుభవించుచుండెను. ఆతఁ డొకనాఁడు గవాక్షమునొద్దఁ గూర్చుండి కోటవెలుపలకుఁ జూచుచుండెను. క్రిందనెందఱో జనులు విచ్చలవిడిగఁ దమతమపనులను జేసి

కొనఁ బోవుచుండిరి. వారినిబట్టి జగత్సింహుఁడు తన స్థితిగతు లను విచారించుకొనియెను. ఆతనికి స్వేచ్ఛ యగపడలేదు. క్రింద నెవ్వరో కొందఱు జనులు గుంపుగూడి యుండిరి. వారేదియో వినోదముగఁ జూచుచున్నట్లుండెను. వారినడుమ నొక వికారవిగ్రహము నిలుపఁబడి యుండెను. మొదలును దుదయుఁ దునిచివైచి కాల్చినత్రాటితుండువలె నాతఁడు సన్నముగను బొడవుగ నుండెను. రంగుకూడ నట్లే యుండెను. ఆతఁ డేదియోపుస్తకమును జదువుచుఁ జేతులు తల ముక్కు మొదలగువానితో నభినయించుచుండెను. ఆతనిముక్కు గజ తుండమువలె వికృతముగ వ్రేలాడుచుండెను. ఆతనిరూపము నకుఁ దోడు చేష్టలును వికృతములుగనే యుండెను. ఆశ్చర్య ముతో జగత్సింహుఁడు నాతనివంకఁ జూచుచుండెను. అప్పు డస్మాఁ ఖాను జగత్సింహునియొద్దకు వచ్చి వందనము చేసి "అదేమి వింతగాఁ జూచుచున్నారు' అనియెను.

జ—నీవును జూడవచ్చును. ఎవ్వఁడో వింతమనుష్యుఁడు?
అ—(పరీక్షించి) ఈతని మీ రెప్పుడును జూడలేదా?
జ—లేదు.

అ—ఇతఁడు హిందూబ్రాహ్మణుఁడే. మందరగడమున నీతని నొకసారి నేఁ జూచితిని.

మందరగడముననున్న యీతనికిఁ దిలోత్తమసంగతి యేమైనఁ దెలియునేమో యని జగత్సింహున కాశ కలిగెను. ఆతఁ డాత్రముతో 'అస్మాఁ! ఇతనిపేరే'మని యడిగెను. "అస్మాను కొంతసేపాలోచించుకొని తడవుకొనుచు నెన్నియో పేరులు చెప్పి తుదకు గజపతి కాఁబోలు' ననియెను. జగత్సిం

హుఁడు బాగుగ యోచించెను. గజపతి యనుపేరు వంగదేశములలో నుండదు. అస్మాను మహమ్మదీయుఁ డగుటచే సరిగాఁ జెప్పలేకపోవుచున్నట్లు గ్రహించెను. అతని నెన్నియో ప్రశ్నలు వైచి తుద కాతనిపేరు గజపతివిద్యాదిగ్గజుఁ డని తెలిసికొనియెను. నా కాతనితో మాటలాడవలయునని యున్నదని చెప్పెను. అస్మా నదివఱకు విద్యాదిగ్గజుని సంభాషణమును వినియుండెను. ఆతఁడు జగత్సింహునితో మాటలాడిన భయము లేదని యూహించెను. 'సరే. అట్లే మాటలాడవచ్చును" అని చెప్పి యాతని దీసికొనివచ్చుటకై సేవకుని బంపించెను.

## తొమ్మిదవ ప్రకరణము.

గజపతి రాజభటునితో లోపలఁ బ్రవేశించెను. జగత్సింహుఁ డాతనిం జూచి, 'నీవు బ్రాహ్మణుఁడవేనా' అని యడిగెను. గజపతి విభ్రాంతుఁ డయ్యెను. అతఁడు బ్రాహ్మణుఁడ నని చెప్పుకొనుటకు భయపడియెను. ఆతఁ డిదివఱకు మహమ్మదీయుల మూలమునఁ బడరానిపాటులు పడియుండెను. తురక లాతని నెన్నియోవిధముల బాధించిరి. కల్మా చదివించిరి. పులావు దినిపించిరి. పిలకజుట్టు దీయించి బోడిగుండు చేయించిరి. చందనతిలకమును దుడిపించిరి. తురకదుస్తుల దొడిగించిరి. అందువలన నాతనికిఁ దురకయనుమాటయే గర్భనిర్భేదనముగ నుండెను. తురకనగరున నున్న జగత్సింహుఁడుకూడ నాతనికి హిందువుఁడుగాఁ దోఁచుటలేదు. మాఱువేషముతో నున్నమహమ్మదీయుఁడని యాతని కనుమానమయ్యెను. అతఁడు జగత్సింహునితో 'అయ్యా! నన్నింక నెందులకుఁ జంపెదరు? నేను మీ

దాసానుదాసుఁడను. దయయుంచి నన్నుఁ బోనిండు. మీ ధర్మమా యని ఫకీరునై బ్రదికెదను' అనియెను.

జగత్సింహుఁడు నెమ్మదిగా 'అయ్యా! మీఁది మందర గడముకాదా? నేను రాజపుత్త్రుఁడను. నీకు భయ మెందులకు? నా ప్రశ్నకు బ్రత్యుత్తరమిమ్ము' అనియెను. తాను వీరేంద్ర సింహుని దుర్గమువాఁడనని కూడ వారికిఁ దెలిసినందులకు విద్యా దిగ్గజుఁడు మఱింత భయపడియెను. వచ్చియురాని తురక మాటలతో వారిని ప్రార్థింప నారంభించెను. కన్నీరు కాలువలు గట్టున ఁ్రేళ్లెను. జగత్సింహునకు నవ్వును విసుఁగునుగూడఁ గలిగెను. ఆతని దగ్గఱకుఁ జేరఁదీసుకొని భయములేదని చెప్పి బుజ్జగించి మీఁది మందరగడము కాదా?' అనియెను.

విద్యా—(వడఁకుచు) అ—వు—ను.

జగ—నీవు బ్రాహ్మణుఁడవేనా?

విద్యా—ఔనుగాని యిప్పుడు మహమ్మదీయులలోఁ గలసి పోయితిని?

జగ—అదియేమి?

జగత్సింహుఁడు చేతులు నలువుకొనుచుఁ దురకలు తన్ను నిర్బంధించిన సంగతులన్నియుఁ జరిగినవి జరిగినట్లుగాఁ జెప్పెను. జగత్సింహుఁ డస్మానువంక నతితీవ్రముగఁ జూచుచు 'మతవిషయమునఁ దురక లిట్టిదుర్మార్గము చేయుట ధర్మవిరుద్ధము కాదా?' అనియెను. 'మేము సత్యమని నమ్మిన మతమును మా రాజ్యమున వ్యాపింపఁజేయుట ధర్మవిరుద్ధ మని యెవ్వరు చెప్పఁ గలరు?' అని అస్మాను చెప్పెను. జగత్సింహుఁ డాతనితో

మారుమాట చెప్పలేదు. ఆతఁడు దిగ్గజునిం జూచి 'విద్యాదిగ్గజా!' అని పిలిచెను.

విద్యా—కాదు. నన్ను సాహేబు దిగ్గజా! యని పిలువుఁడు!

జగ—నీవు సాహేబు వైతివా?

విద్యా—నేనే కాదు. మందరగడము తురకలపాలైన తరువాత నచ్చటివారందఱును సాహేబులే యైనారు.

జగ—అభిరామస్వామియో ?

విద్యా—ఆతఁడు పాఱిపోయినాఁడు.

జగ—వీరేంద్రసింహుఁడు?

విద్యా—వీరేంద్రసింహుఁ డెక్కడనున్నాఁడు? నబాబుగారాతనితలఁ గొట్టించి వైచినారు.

జగత్సింహునికన్ను లెఱ్ఱబడియెను. నిప్పులు గురియుచుండెను. ఆతఁడు మండిపడుచు నస్మానుం జూచి 'ఈమాట సత్యమేనా?' అనియెను.

అస్మా—ఔను. రాజద్రోహాపరాధమునకై యాతనికి మరణదండనము కావింపఁబడినది.

జగ—అందులకు నీవును సమ్మతించితివా?.

అస్మా—లేదు. అందులకుఁ బ్రతికూలమైన నామాట త్రోసివేయఁబడినది.

జగత్సింహుఁ డేమో యాలోచించుచుండెను. అస్మాను దిగ్గజుని బొమ్మని చెప్పెను. జగత్సింగు దిగ్గజుని చేయిపట్టుకొని యాపి 'విమల యేమైనది' అని యడిగెను. దిగ్గజుఁడు పెద్ద నిట్టూర్పువిడిచి గద్గదస్వరముతో 'ఆమె సుల్తానుగారి యుంపుడు

కర్తైయై యున్నదఁట!' అనియెను. 'ఇదియును సత్యమేనా?' అని రాజపుత్త్రుఁడు మరల నస్మాను నడిగెను. అస్మాను ప్రత్యుత్తరము చెప్పలేదు. దిగ్గజుని తత్క్షణమే వెడలిపోవలసినదని చెప్పెను. రాజపుత్త్రుఁ డాతనిఁ బోనీయలేదు. 'దిగ్గజా! తిలోత్తమ యెట్లున్నది?' అనియెను. విమలాతిలోత్తమలు రాజాంతఃపుర మున సుఖముగనున్నారు?' అని దిగ్గజుఁడు చెప్పెను.

జగత్సింహుఁ డప్రతిభుఁడై యాతనిచేయి వదలి పెట్టెను. అతఁడు బొట్టనవ్రేళ్లపై నడచుచు నంతలో మాయ మైపోయెను. అస్మానుఖానుచాల సిగ్గుపడియెను. 'నే నేమి చేయు దును? ఉద్యోగిజనసామాన్యుఁడనుగదా!' అనియెను. 'కాదు. నీవు రాక్షసుఁడవు' అని జగత్సింహుఁడు కోపముతో బదులు చెప్పెను.

---

## పదియవ ప్రకరణము.

ఆరాత్రి జగత్సింహునకు నిద్రపట్టలేదు. వేయి తేళ్లు కుట్టి నట్లుండెను. సర్వాంగములును హృదయమును తపించిపోవు చుండెను. ఎవ్వాతె జీవితమునఁ దనజీవితము నిలిచియున్నదో యట్టితిలోత్తమ యింకనీలోకమున బ్రదికియుండుటయే యాత నికిఁ గష్టముగా నుండె. ఆతిలోత్తమ యింకను జీవించియే యున్నది. ఆదివ్యకుసుమమును, ఆమధురతేజమును, ఆమృ దులవల్లికను ఆలావణ్యరాశిని, ఆజగత్సింహునికన్నుల కర్పూ రాంజనమును తానెంత దయలేనిదై యున్నను మృత్యుదేవత మ్రింగివేయఁగలదా? ఈ విశాలప్రపంచమున నాదివ్యసుందర విగ్రహము భిన్నములైన నగపడకుండఁ బోఁగలవా?

జగత్సింహుఁడు విచారమునఁ బడిపోయెను. అందుగు చెట్టునుండి పాలవలె నాతనికన్నులనుండి వేడికన్నీళ్లు జాలు వారుచుండెను. ఆతనిహృదయమున నరకమువంటి కటులూ ఖానుని విలాసమందిరమును నాదుష్టాత్మునిప్రక్కను విమలా తిలోత్తములును గానఁబడుచుండిరి. ఆతనిహృదయగోళ మగ్ని పర్వతమువలెఁ గ్రాగి కరఁగిపోవుచుండెను. ఆతనిహృదయ సింహాసనమున నంతవఱకు నివసించియున్న యాతిలోత్తమ యిప్పుడు తురకలయంతఃపురమున విలాసినియైయున్న ట్లాతని చెవులఁబడినది. ఇఁక నాతని కాలావణ్యరాశిపై మనసు పోవు నా? తనహృదయఫలకమునఁ జిత్రింపఁబడియున్న యావిగ్రహ మును దుడిచివేయుటకు పౌరుషమూర్తియగు నారాజ కుమారుఁ డించుకయైన సందేహించునా? కాని యామూర్తి యాతనిహృదయక్షేత్రమునఁ బాదుకొని పోయినది. దానిని బెఱికివేయవలయు ననిన హృదయమునుగూడఁ బెల్లగింప వలయును. అది యాతని కసాధ్యముకాదా! ఆతని చెదరిన హృదయమున స్మృతియున్నంతవఱకు బరితపించినశరీరమున రక్తమాంసము లున్నంతవఱకు నా లావణ్యరాశి యాతని యంతరంగమున రాజ్యముచేయుచునే యుండును.

ఆతనికి మనశ్శాంతి లేదు. వివేచనా జ్ఞానము లేదు. జ్ఞాపకశక్తి లేదు. ఆలోచనలు మెఱసిపోవుచుండెను. తెల్లవారు వఱకు నట్లే కూర్చుండియుండుటచే నొడలంతయుఁ గుములఁ గొట్టి నట్లయిపోయెను. ఆతఁడు కిటికీయొద్దకుఁ బోయి చూచెను. ఇంకను నంధకార మెల్లెడల వ్యాపించియున్నది. పలుచనిమబ్బు గ్రమ్మియుండుటచే నాకసమునఁ జుక్క లస్పష్టముగ నగపడు

చుండెను. కొన్ని చుక్కలు మబ్బుముసుఁగు నెడఁబాసి మినుకు మినుకుమనుచుండెను. దూరమున జెట్లన్నియు నేకమై చీఁకటి గోడవలె నగపడుచుండెను. అందందు వజ్రములవలె మిణుగురు బురువులు మెఱయుచుండెను. మబ్బు చలువల నపహరించి వచ్చుమందమారుతము కొంతసేపటి కాతని శరీరోష్ణమును జల్లఁబఱిచెను. ఆగాలి యాతని యాయాసము నించుక తగ్గించెను. ఆతఁ డేక యోచించుట లేదు. ఆతనిహృదయ మింత వఱకు గత్తిపోటులఁ బడియున్నది. అం దిప్పుడు నిరాశ యాశ్రయించి బాధించుచున్నది. అది యంత హెచ్చుగ లేదు. హృదయమున నిరాశ స్థిరపడియున్నచో బాధ విశేషముగ నగపడదు. ఆతని కిప్పుడున్న బాధ నిరాశ యొక్కటియే. అతఁ డొకసారి యాకాశమునకు దృష్టి నిగుడించెను. కన్నీరు గ్రమ్మ నంధకారమయం బగుతనహృదయాకాశమును జూచికొని యెను. క్రమక్రమముగ స్మృతి కలుగనారంభించెను. తనచిన్న తనము మొదలిప్పటివఱకును గల్గి[illegible]లన్ని[illegible]లో చనమునఁ బడియెను. ఆయాలో[illegible]పరవశత్వమున [illegible] జ్ఞానము నశించుటచే నాతఁడు [illegible]కిటికీకమ్ములు పట్టుకొని [illegible] నిద్రించెను.

అప్పు డాతఁ డతిదుస్స[illegible]గు స్వప్నముం గాం[illegible] వరపడుచుండెను. ముఖవికారమ[illegible]బట్టి యాతఁడు [illegible] బరితాపమును గోపమును గాంచుచు[illegible]కట్టు[illegible]డెను. పెదవు లదరుచుండెను. లలాటమునఁ [illegible]ట్టెను. చేతులు ముడుచుకొనిపోయినవి. అంతలో నాతఁడు నులికిపడి లేచి యట నుండి వెడలిపోయెను. ఆతఁ డెంతబాధపడియెనో వ్రాయఁ

జాలము. ఆగదిగోడలపై బాలసూర్యకిరణములు ప్రసరించు నప్పటి కింక నాతఁడు కిటికీనేలను బండుకొని నిద్రించుచునే యుండెను.

ఉదయమున నస్మాను వచ్చి యాతని లేపి నమస్కరించి యొకయుత్తరము నిచ్చెను. ఆతఁడు దాని నందుకొని యస్మాను వంకఁ జూచెను. వికలహృదయుఁ డగునాతనితో మాటలాడుట కస్మాను సంశయించుచు 'రాజకుమారా! ఈజాబు నీ కందింతునని యిది వ్రాసినవారికి నేను మాట యిచ్చితిని. ఇంత వఱకు నీకియ్యకపోవుటకుఁ గారణము నీకే తెలిసిపోయినది. ఎట్లో యీయుత్తరము నీకిచ్చివైచితిని. నీమనసు వచ్చినప్పుడు చదువుకొనుము. నీవు ప్రత్యుత్తరము వ్రాసినచో సాయంతనము వచ్చి తీసికొనిపోయి వారికిచ్చెదను' అని చెప్పి యాతఁడు వెడలిపోయెను. జగత్సింహుఁ డొంటిగాఁ గూర్చుండి యాయుత్తరమును దుపవఱకును జదువుకొనియెను. వెంటనే దానిని నిప్పులోఁ బడవైచి మండుచున్నంతవఱకుఁ దానివంకఁ జూచుచుండెను. పూర్తిగ భస్మమై పోయినది. అప్పు డాతఁడు తనలో 'మాటిమాటికిని స్మృతి కలిగించుచుండు నీయుత్తరమును మంటలోఁ బారవైచితిని. స్మృతినిగూడ బరితాపమను మంటలోఁ గాల్పవచ్చును. కాని యది దీనివలె భస్మమైపోవునా?' అని యనుకొనియెను.

ఆతఁడు తరువాతఁ గాల్యకృత్యములం దీర్చికొని యాకసమువంకఁ జూచుచుఁ జేతులు జోడించి యీశ్వరుని నుద్దేశించి "ఓపరమేశ్వరా! నేను రాజపుత్రవీరునకుఁ దగిన ట్లుండఁగోరి యానీచుఁడగు మ్లేచ్ఛునియుంపుడుకత్తెయైపోయిన

యువతిని నాహృదయమునుండి పారఁద్రోలఁ జూచుచుంటిని. దయామయా! ఇందులకు నీవు తోడుపడవలయును. మనుష్యశక్తినంతను వినియోగించితిని. సర్వాంతర్యామి వగునో దేవా! నాహృదయమును బరీక్షింపుము. అం దింకను దిలోత్తమం గూర్చిన పరితాప మున్నదా? ఆమెను జూడవలయు నను కోరిక యున్నదా? లేదు. నాకు కోరికలేదు. కాని దుస్తరం బగుస్మృతిమాత్రము నన్నింకను బాధించుచున్నది. స్వామీ! దయయుంచి యిఁక నాకట్టిస్మృతిమాత్రము కలుగకుండఁ గటాక్షింపుము. సర్వేశ్వరా! నీకు పదివేలనమస్కారములు" అని ప్రార్థించెను.

తిలోత్తమమనోహరాకారము జగత్సింహుని హృదయాంతరాళమునఁ గ్రిందఁబడి పొరలుచున్నది. ఆమె యేవెలుంగున విపదంధకారము నడంచుకొనుట కాశపడియున్నదో యాశుక్రతార నిష్ప్రకాశకమై పోయినది. పాప మీసంగతి యామె కేమియును దెలియదు.

## పదునొకొండవ ప్రకరణము.

అస్మానుఖాను సాయంకాలము జగత్సింహునొద్దకు వచ్చెను. అప్పటికప్పుడే వ్రాసియుంచినప్రత్యుత్తరమును జగత్సింహుఁ డాతని కిచ్చెను. అస్మాను దాని నందికొని "ఇచ్చట నున్న వా రెవ్వరికైన జాబువ్రాసినయెడల దానిని ముందుగ మేము చదివి చూడవలయును. అందలివిషయములు మాకు సమ్మతములుగ నుండిననే మేము వారికి దాని నందింతుము. ఇది మానియమము" అని చెప్పెను. జగత్సింహుఁడు సరియే. నీ

యిష్టమువచ్చినట్లు చేయు మనియెను. అస్మానుఖాను యుత్తరమును విచ్చి యిట్లు చదివెను.

"మందభాగ్యులారా! నేను నీప్రార్థనమును మఱచిపోను. కాని నీకు నిజముగఁ బ్రేమయున్నచో నీభర్తమార్గమునే త్రొక్కవలసియుండెను. అట్లయినచో నీకుఁ గళంకమనుమాటయే లేకపోనుగదా!

జగత్సింహుఁడు."

అస్మా నాయుత్తరమును చదివి 'నీవుక్రూరుఁడ' వని జగత్సింహుని నిందించెను. 'పఠానులకంటెను గ్రూరుఁడను గా'నని జగత్సింహుఁడు పలికెను. అస్మాను "నీవిషయమునఁ బఠానులంతక్రూరముగాఁ బ్రవర్తింపలేదనుకొనియెదను" అని పరుషముగా బలికెను.

జగత్సింహున కభిమానమును కోపమును కలిగెను. "నేను నామాట చెప్పలేదు. నీవు నన్ను దయతోడనే యాదరించితివి. నిశ్చయమే నన్నుఁ జంపుటకై పోరాడిననన్నుఁ బట్టికొనియు బ్రాణములఁ గాపాడితివి. చెఱయందుంపఁదగిన నన్ను దివ్యభవనమునం దుంచితివి. కాని నీవు నన్ను నీకు ఋణపడియుండునట్లు చేసికొంటివి. నాకు సుఖమునే గూర్చుచుంటివి. కాని దీనియుద్దేశమేమో నాకు బోధపడుట లేదు. నేనపరాధినైనచో నన్ను జెఱయందే యుంచుము. కానిచో నాకీ కనకపంజర మెందులకు? నీదయ యనువలలో నన్నుఁ జిక్కులఁ బెట్టవలదు." అనియెను.

అస్మా—అపేక్షింపకయే రానున్న యాపదలకై యాశపడు టెందులకు?

జగ—కుసుమశయ్యను వదలి కఱకు నేలను బరుండుట రాజపుత్త్రులు దురదృష్టమని యనుకొనరు.

అస్మా—దురదృష్టము కఱకురానేలకంటెఁ గష్టదాయకము గాకున్నచో విచారమే లేకపోవచ్చును.

జగ—'కటుల్ ఖానుని జయింపఁజాలక పట్టుపడిపోయితివి' అను నవమానముచే బాధపడుచున్న నాకుఁ దలవరివానిఖడ్గ ప్రహార మెంతపాటిది?

అస్మా—చాలుచాలు! పఠానులు వృథాడంబరములు పలుకువారు కారు.

జగ—(అలక్ష్యముగ నవ్వుచు) నన్ను బెదరించుచుంటివా? ఎన్నటికి నీయుద్దేశ మీవిషయమున ఫలింపనేరదు.

అస్మా—వృథావాగ్వ్యయ మెందులకు? మన మొండొరుల నెఱుంగనివారము కాము. నీతో నొకపనియుండి వచ్చితిని.

జగ—(ఆశ్చర్యముతో) ఏమిపని?

అస్మా—మా రాజునాజ్ఞ ననుసరించి మాటలాడుచున్నాను. రాజపుత్త్రులకును బఠానులకును గలపరస్పరకలహము లిరువురకును నష్టదాయకములే. మమ్ము మూలచ్ఛేదము చేయవలయునని మీరు తలంచుచుందురు. కాని యంతపని జరుగునప్పటికి మీరును నాశనము కాక మానరు. నిరంతరముఁ జక్రవర్తితోఁ బోరుచు నోరిస్సాయం దుండుట పఠానులకు కష్టమే కాని వారెన్నటికిని జక్రవర్తికి లోఁబడరు. నీవును రాజకార్యనిపుణుఁడవు. జాత్యభిమానము నొకచో నుంచి బాగుగ యోచింపుము. ఒరిస్సాకును ఢిల్లీకి నెంతదూరమున్నది? ఒకవేళ మానసింహుఁడు మమ్ము

జయించి మారాజ్య మగ్బరువశము చేయుననుకొనుము. వారి విజయధ్వజ మొరిస్సాలోఁ జిరకాలము నిలువఁ జాలదు. మానసింహుఁడు వెనుక మొగము పెట్టినతోడనే మరలఁ బఠానులు విజృంభింపకమానరు. ఒకసారి యగ్బరీరాజ్యమును జయింపలేదా? ఆవిజయ మెంతకాలమున్నది? ఎప్పటికైన నింతే. పఠానులు వంగదేశజులవలెఁ బిఱికి వారుకారు. ఎప్పటికిని వా రొకరికి లొంగి యుండరు. ఒక్క పఠానునికైన ముక్కున నూపిరియున్నంతవఱకుఁ జక్రవర్తి యొరిస్సాచేఁ జిక్కుననుట కల్ల. పర్యవసానమున లాభములేని వృథారణములచే భూమిపై రాజపుత్రులును, పఠానులును తమరక్తములను బ్రవహింపఁ జేయుటవలన నేమి లాభమున్నది?

జగ—అట్లయిన నీవిప్పు డేమందువు?

అస్మా—ఏమియును లేదు. మారాజుగారికి సంధి చేసికొనవలె నని యున్నది.

జగ—ఎట్లు?

అస్మా—అదియే మనము యోచింపవలయును. కటులుఖానుఁడు వంగదేశమునఁ దానువశపఱచుకొన్న భూభాగమును వదలి వేయుటకు సిద్ధముగానున్నాఁడు. చక్రవర్తి యొరిస్సాపైఁ దనయధికారమును వదలుకొనవలయును. ఇక్కడ రణమను మాటలేకుండ నాతనిసేనలను దీసికొనిపోవలయును. సంపాదించుకొన్న రాజ్యమును మేము వదలుకొనుచుండ స్వాధీనముకాని రాజ్యముపైఁ దనయధికారమును వదలు

కొనుట యగ్బరుచక్రవర్తి కంతనష్టముకాదు సరికదా· ఉభయులును నెమ్మదిగ నుండుట కిది మంచి యుపాయము.

జగ—మంచిది. ఈసంగతి నాతోఁ జెప్పుటవలన నేమిలాభము. సంధికైనను విగ్రహమునకైనను మానసింహుఁడున్నాఁడు. ఆతనికి రాయబారమంపిన బాగుగనుండును.

అస్మా—మేమట్లు చేసితిమి. కాని నిన్ను మేము చంపివైచితి మని యాతని కెట్లో తెలిసినది. అందుచే నాతనికిఁ గోప మును విచారము నధికమయ్యెను. మా రాయబారి యెంత నమ్మించినను నమ్మక యీతఁడు సంధి కంగీకరింపలేదు. ముఖ స్థముగ నీవే మాటలాడినచో నీకార్యము పొసఁగఁగలదని నానమ్మకము.

జగ—అట్లయిన నేనొకయుత్తరము వ్రాసి పంపెదను.

అ—ఉత్తరములవలనఁ బని జరుగదు. మానసింహునకుఁ బఠానుల పరాక్రమముంగూర్చి యంతఁగా దెలియదు. ఆ విషయమై మీరు సత్యమును మనవి చేయఁగలరు. ఇది గాక మిమ్ము మేము విడిచిపెట్టి పంపుటకూడ సంధి కను కూలము కావచ్చును. కావున మీరే స్వయముగఁ బోయి యీకార్యము చక్కఁజేయవలయు నని మానబాబుగారి యుద్దేశము.

జగ—మాతండ్రిని దర్శింపఁబోవుటకు నాకేమియు నభ్యంత రము లేదు.

అ—మంచిది కాని యింకొకమనవి యున్నది. ఈవిధమున సంధికుదురనిచో మీరు మరల మాయొద్దకు వచ్చునట్లు ప్రమాణము చేయవలయును.

జగ—ప్రమాణమువలన నేమిలాభము? నేను మరల వత్తునని మీ కేమి నమ్మకము.

అ—(నవ్వుచు) అక్కఱలేదు. రాజపుత్రులు సత్యసంధులనుమాట జగద్విదితమే.

జగ—సరే. అట్లయిన మాతండ్రిని జూచినతోడనే మరల నేనొక్కఁడను మీకోటకు వచ్చెదను.

అ—ఇంకొకమనవి. మీరు మానసింహునితో మేము చెప్పినమాట లన్నియును మనవిచేయవలయును.

జగ—నేనీవాగ్దానము చేయఁజాలను. చక్రవర్తిచేఁ బఠానులను జయించుటకే నియమింపఁబడితిని కాని, వారితో సంధి చేయుటకుఁ గాదు. కావున నేనట్టిపని చేయఁజాలను. ఆ విషయమున మాటలాడజాలను.

అ—సెబాస్. సరే యని తప్పించుకొనిపోకుండ రాజపుత్రునకుఁ దగినట్లు సత్యమునే చెప్పితివి. కాని నీవిట్లు చేయకున్నచో నీకు స్వేచ్ఛయే లేదని నమ్ముకొనుము.

జగ—చక్రవర్తికి నాస్వేచ్ఛతో నేమిపని? ఆతనికి నావంటి రాజపుత్రు లెందఱో యున్నారు.

అ—అట్లు కాదు. నామాట విని నీయభిప్రాయమును మార్చుకొనుము.

జగ—ఏమీ?

అ—నీమూలమున నీకార్య మగునని నబాబు నమ్మియున్నాఁడు. నీ వీ విషయమున వ్యతిరిక్తుఁడవై యున్నంతవఱకు నిన్నాతఁ డెన్నియో విధముల నిర్బంధింపక మానఁడు.

జగ—నన్ను మరల భయపెట్టుచుంటివా? నన్నుఁ జెఱయందే యుంచుమని నిన్నప్పుడే గాదా యడిగితిని.

అ—నీవు పడుచుదనముచేఁ దూరమాలోచింప కున్నావు. నీమూలమున నబాబు సంతుష్టుఁడైనచో నీకు విశేషలాభమున్నది.

జగ—ఆతనిదయ లేకున్న నాకేమి లోపము? వీరేంద్రసింహుని రక్తప్రవాహము నారక్తపాతముచే మఱికొంతదూరము సాగునుగాక! ఇంతకన్న నింకేమగును.

అ—జగత్సింహా! నేఁజేయవలసినపని యైపోయినది. ఇఁక నేఁబోయెదను. ఇంకొకనిమిషములో నబాబుగారియాజ్ఞను నీవు విన గలవు. అనిచెప్పి యస్మాను వెడలిపోయెను. కొంతసేపటికి కొక సైనికోద్యోగియు నలుగురుపదాతిసైనికులు నచ్చటికి వచ్చి జగత్సింహుని వెంటఁబెట్టుకొనిపోయిరి.

## పంద్రెండవప్రకరణము.

నేఁడు కటుల్ఖానుని జన్మదినము. దుర్గమున దినమంతయు నాటలు, పాటలు, హాస్యములు, దానములు, ధర్మములు మొదలగువినోదములతో నతివైభవముగ నుండెను. సాయంకాల మగునప్పటికి కోటయంతయు దీపములతో నలంకరింపఁబడియెను. రాజమార్గములే కాక సందులు గొందులుగూడ జనసంకులములై క్రిక్కిరిసి యుండెను. ఎచ్చటఁజూచినను సంగీతములే— నాట్యములే— మధుపానములే— గారడులే— వేశ్యలే— వేషకర్తలే. తములపాకులు, రుచ్యభక్ష్యములు,

చిత్రవస్తువులు, పరిమళద్రవ్యములు, పుష్పాసవములు, ఫలములు మొదలగునవి విక్రయించునంగడు లెల్లెడల నిండియుండెను. రాజభటులుగూడ మధుపానమదంబున నొడళు తెలియకుండ సంచరించుచుండిరి. దానములకై యాచకులు గుంపులుగుంపులుగఁ బోవుచుండిరి. కోటలోపలను వెలుపలనుగూడ నిట్లే యతివినోదముగనుండెను. మధుపానములకును వ్యభిచారములకును బరిమితియేలేదు. ఒకరిసంగతి నొకరు తెలిసికొనుట కవకాశములేకుండ నెవరిమట్టునకు వారువినోదముల ననుభవించుచుండిరి.

నబాబుగారి యంతఃపురము స్వర్గతుల్యముగనే యుండెను. ఎక్కడఁజూచినను సుగంధపరిమళములే. దీపప్రకాశమున బట్టపగలుగానుండెను. అంతటను రత్నకంబళములు పఱుపఁబడియుండెను. చిత్రవస్తువులు పూలకుండ్లు మొదలగువానిచే యథాయోగ్యముగనలంకరింపఁబడియెను. పరిచారికలు రంగురంగులదుస్తులం దాల్చి తళుకుబెళుకు సొమ్ముల నలంకరించుకొని చిటుకుచిటుకున నిటునటు దిరుగాడుచుండిరి. కొందఱు పరిచారికలు రాణుల నలంకరించుచుండిరి. నబాబుగారిబీగములకు లెక్కయే లేదు. అందఱును నానాఁడు భర్తృ దర్శనమగును. నాథుని సంతోషపెట్టుటలో నొకరినొకరు మించవలయు నను నుద్దేశముతో నలంకరించుకొనుచుండిరి. అందఱు నొక్కొక్క కోరికల పెట్టుకొనియుండిరి. ఆనాఁడు కోరిన కోరికలకు లేదనుమాట యుండదు.

అప్పు డొకసుందరీమణి చక్కఁగ నలంకరించికొని యిటునటుఁ దిరుగుచుండెను. ఆమెకు వలయునలంకారము

లన్నిటిని నబాబుగారు పంపించియుండిరి. ఆమె యాయంతఃపురమున విచ్చలవిడిగఁ దిరుగుచుండెను. ఆరాత్రి యెవ్వరెట్లున్నను నెచ్చటికిఁ బోయినను నభ్యంతరపెట్టువా రెవ్వరును లేరు. ఆమె తనయందమునకుఁ గాని యాభరణములకుంగాని యుబ్బిపోవుచున్న ట్లగపడుట లేదు. ఆమె మొగమున వికాసముగాని సంతోషముగాని యున్నట్లు లేదు. గంభీరముగను శాంతముగ నుండెను. ఆమెహృదయమునం గలయగ్నిజ్వాల యామెకన్నులలో బ్రతిఫలించుచుండెను.

ఆమె విమల తిరిగితిరిగి యామె యొకసుందరమందిరమునఁ బ్రవేశించి తలుపు వైచికొనియెను. అంతటిసంతోషదినమున నాయింట నొక్కదీపము మాత్రమే యుండెను. అట నొకశయ్యపై నెవ్వరో నిలువున ముసుఁగు పెట్టుకొని పరుండియుండిరి. విమల యచ్చటకుఁ బోయి 'తిలోత్తమా! అని పిలిచెను.

తిలోత్తమ యులికిపడి లేచి విమలను గుర్తించెను; గాని యేమియును మాటలాడలేదు. అట్లే ముసుఁగుఁ దీసివైచి కూర్చుండెను. విమల మఱలఁ బిలిచెను. తిలోత్తమ మాటాడకుండ విమలను నట్లే చూచుచుండెను. ఆమె మునుపటివలె లేదు. ఆమొగమున లావణ్యము మాసిపోయినది. మునుపటికంటెఁ బదియేండ్లకు మించిన వయసు కలదానివలె నుండెను. ఆమె తన యలంకారముల నన్నిటిని దీసివైచెను. కాని యవి ధరియించుచోటుల నానవాళ్లుమాత్రమగుపడుచున్నవి. ఆమె కట్టినచీర మాసియున్నది.

విమ—నేనన్న ప్రకారము వచ్చితిని. మాటలాడవేమి?
తిలో—చెప్పవలసిన దిదివఱకే చెప్పితిని. ఇఁక మాటాడుట కేమున్నది?

తిలోత్తమ యేడ్చుచున్నట్లు కంఠస్వరమునుబట్టి తెలియవచ్చెను. విమల యామెతలపైఁ జేయివైచి మొగమెత్తి జూచెను. ఆమెకన్నులు బాష్పపూరితములై యుండెను. ఆమె పయ్యెదచెఱఁగంతయును దడిసిపోయినది. తలగడయును దడిసిపోయెను. "నీమృదుహృదయ మీదుర్భరదుఃఖము నెంతకాలము సహింపఁగలదు?" అని విమల యనియెను. "సహింపకేమి? ఇంకను సహించియున్నందులకు దుఃఖపడుచున్నాను." అని తిలోత్తమ హీనస్వరముతోఁ బలికెను.

విమల కేడుపువచ్చెను. కొంతసేపేడ్చి యొక్కనిట్టూర్పు విడిచి "ఈరాత్రి యేమి చేయవలయును.?" అనియెను. తిలోత్తమ యతికష్టముతో విమలయలంకారరచనముం జూచుచు "ఆలోచనలవలన లాభమేమున్నది?" అనియెను.

విమ—అమ్మా! నన్ను నిందింపకుము. కటులూఖానుఁడు మనమెఱుఁగని వాఁడుకాఁడు. ఇంతలో మనదుఃఖము తీరుననియో, యవకాశము లేకయో యాతఁ డిప్పటివఱకు మనలను విడిచిపెట్టినాఁడు. నేఁటితో మనస్వేచ్ఛ యడుగంటినది. ఇప్పుడు నాట్యశాలకుఁబోనిచో మనపనియేమగునో?
తిలో—ఇంతకంటె నేమగును?
విమ—తల్లీ! ఇంతలోనే నిరాశపడుటెందులకు! మనముక్కున నూపిరియున్నంతవఱకు మన మరియాదను మనము దక్కించుకొనవలయును.

తిలో—అమ్మా! అట్లయినచో నీనగల నన్నిటిని దీసివేయుము. అవి నాకన్నులను బొడిచివైచుచున్నవి.

విమ—(చిఱునవ్వుతో) నానగలను బాగుగఁ జూడకుండఁ గోప పడియెదవేమి?

అని పలుకుచు నామె తనదుస్తులలో నడఁచియుంచిన కత్తినిదీసిచూపించెను. కన్నుల మిఱుమిట్లుగొలుపు నాకటారిం జూచి తిలోత్తమ యులికిపడియెను.

తిలో—ఇది నీకెక్కడ దొరకినది?

విమ—నిన్న నంతఃపురమునకు వచ్చినక్రొత్తదాసిని నీవు చూచితివా?

తిలో—ఆమె యామ్మా నీకాదా?

విమ—ఔను! ఈకత్తి నామెచేతనే యభిరామస్వామియొద్ద నుండి తెప్పించితి?

తిలోత్తమ నివ్వెరపడియెను. ఆమెహృదయము చలించి పోయెను. కొంతసేపైనతరువాత "అమ్మా! ఈరాత్రి నీవీవేష ముతోనే యుందువా?" అనియెను.

విమ—ఇట్లే యుండెదను. నీవు నాతో రావా?

తిలో—రాను.

విమ—నేను నిన్నొంటిగ విడిచి పోఁగలనా?

తిలోత్తమ యేడువ మొదలుపెట్టెను. విమల యామె నూఱడించి యుస్మాన్‌ఖాను తనకిచ్చినయుంగరము నామెకిచ్చి "రాత్రి రెండుజాములవఱకు వినోదములు జరుగుచునే

యుండుము, నేను కట్లుఖానునొద్ద నుండి యాతనికిఁ గాల క్షేపము చేయుచుందును. ఆతనికి నీమాటయే జ్ఞప్తికి రాకుం డునట్లు చేసెదను. రెండుజాములకు నీ వీయుంగరముఁ దీసికొని ద్వారముకడకుఁ బొమ్ము. అక్కడ నిట్టియుంగరము గలపురుషుఁ డొక్కఁడు నీకగపడఁగలఁడు. నీయిచ్చవచ్చినచోటి కాతఁడు నిన్నుఁ దీసికొనిపోవును, ఏమియు సంశయింపవలదు. ఆతనితో నభిరామస్వామియింటికిఁ దీసికొనిపొమ్మని చెప్పుము” అని బోధించెను.

ఆనందాశ్చర్యములతోఁ దిలోత్తమ మాటలాడ లేక పోయెను. కొంతసే పైనతరువాత 'ఈయుంగరము నీకెట్లు దొరకినది?' అనియెను.

విమ—చాల గొడవయున్నది. మఱియొకప్పుడు చెప్పెదను. సంశయింపక నేఁజెప్పినట్లు చేయుము.

తిలో—నీవెట్లు తప్పించికొని వచ్చెదవు?

విమ—నాకొఱకు నీవు విచారింపవలదు. ఎట్లో యొకవిధముగా రేపు నీతోఁ గలిసికొందును.

అని విమల తిలోత్తమకు ధైర్యముచెప్పెను. కాని తన కొఱకు విమల స్వార్థత్యాగము చేయుచున్న దనుసంగతి తిలో త్తమ దెలిసికొనఁజాలకపోయెను. తిలోత్తమ కెన్నాళ్లనుండి యో లేనిసంతోషము మఱల వచ్చెను. విమల తాను పోయెద నని చెప్పెను. తిలోత్తమ కన్నుల నీరునించుచు గద్గదస్వర ముతో “అమ్మా! నీ కీకోటలో నన్ని సంగతులును దెలిసియుం డును. ఇందు మనకుఁ గావలసినవా రెవ్వరెవ్వ రెందుండిరో చెప్పెదవా!” అని యడిగెను.

ఇంతటి కష్టకాలమునఁగూడ దిలోత్తమ స్మృతిపదమున జగత్సింహుఁడు సంచరించుచుండె నని విమల తెలిసికొనియెను. జగత్సింహుఁ డతిపరుషముగఁ దనకువ్రాసినజాబునందుఁ దిలోత్తమపేరైన వ్రాయలేదు.

ఇదివఱకే దుర్భరదుఃఖమునఁ గ్రుంగిపోయియున్నతిలోత్తమ కాసంగతి చెప్పఁగూడదని తలంచి 'అమ్మా! జగత్సింహుఁ డీదుర్గమునందే యున్నాఁడు. ఆతని కారోగ్యముగనే యున్నది" అని చెప్పెను.

తిలోత్తమ మాటాడలేదు. ఆమెను ముద్దుపెట్టుకొని విమల వెడలిపోయెను.

---

## పదుమూఁడవప్రకరణము.

ఇప్పటికిఁ గ్రూరరాక్షసునిబారినుండి తప్పించుకొనుట కుపాయము దొరకెను గదా యని యాలోచించుకొనుచుఁ దిలోత్తమ యొక్కశయ్యను గదిలోఁ గూర్చుండియుండెను. ప్రాణప్రియముగఁ జూచుకొనుచుండు విమల మూలముననే తన కిట్టిసౌలభ్యము కలిగినదని యామె నభినందించుచుండెను. ఆమెహృదయము విచారానందపూరితమైయుండెను. ఎక్కడకుఁ బోవుదు నని యూహించెను. అయ్యో! మాదుర్గ మిచ్చట కెంతదూరమున్నదో యని విచారించెను. ఆతలపుచే నామె కన్నుల నీరుగ్రమ్మెను. తననిమిత్తము శత్రువులచేఁ బట్టువడిన రాజపుత్త్రుఁ డామెతలఁపునఁ బడియెను. ఆతఁడు కారాగృహమున నుండుననుమాట తలఁచుకొనునప్పటి కామెహృదయము చలించిపోయెను. "హా! పరమేశ్వరా! చెఱసాల యెంతభయం

కరముగ నుండునో! అం దాతఁడెట్లున్నాఁడో? ఏమనుకొను చున్నాఁడో? తిలోత్తమ యింకను నాతనికి జ్ఞప్తియందుం డునా? మఱు పెట్లువచ్చును. నామూలముననే గదా యాతని కీగతి కలిగినది? నన్నాతఁ డెంతగా నిందించుచుండెనో గదా! నిందించిన నిందించుఁగాక! ఆతఁడు నన్ను మఱచి యుండఁడు గదా! తురకలచేతులలోఁ బడితి నని నన్నాతఁ డసహ్యించు కొనునా? ఇందు నాదోష మేమున్నది? కాలవశమున నాతఁడు మాత్రము పట్టుపడలేదా? అసహ్యించుకొనుఁగాక! అతనిపాద ములపైఁ బడి సత్యమును విన్నవించుకొనిన నమ్మకము కలు గదా? దయపుట్టదా? అయ్యో! ఆమృదులహృదయు నెట్లుగా భావించుచుంటిని? ఆతఁడు నన్నుఁ ద్రోసివేయఁడు! త్రోసివేసి నచో నప్పుడే యాతనియెదుట నగ్నిలోఁబడి ప్రాణత్యాగము చేసికొననా? ఆతనిఁ జూచుభాగ్యము లభియించినప్పు డాతని యెదుట నగ్నిజ్వాలలోఁబడినను సంతోషమే. మఱల నేనా తని జూడఁ గలుగుదునా? ఆతఁడు చెఱనుండి విడివడుటకు మార్గ మేమున్నది? ఈయుంగరమువలన నాతని విడిపించుట కేమైన నుపాయ మున్నదా? నాకాలోచనము నెవ్వరు చెప్పు దురు! అతనియొద్దకు నన్నెవ్వరు తీసికొనిపోవుదురు? పోయిన నాతనితో నే నేమని మాటలాడఁ గలుగుదును. అయ్యో! ఇఁక నేమిగతి" అని యామె యోచించుకొనుచుండెను. ఆమె యాలోచనము లొకదానివెనుక నొకటిగసముద్రతరంగ ములవలె నుబుకుచునే యుండెను. అంతలో నొకపరిచారిక యచ్చటకు వచ్చెను. తిలోత్తమ యామె నెన్నిగంటలైనదని యడిగెను. పండ్రెండుగంట లనిచెప్పి యామె వెడలిపోయెను.

ఆమె పోవువఱకును తిలోత్తమ కనిపెట్టియుండెను. తరువాత నామె యుంగరమును దీసికొని బయలుదేరెను. ఆమెకు భయముచేఁ గాళ్లు గడగడలాడుచుండెను. గుండెలు దడదడలాడుచుండెను. మొగము వెలవెలఁ బోవుచుండెను. ఒక్కయడుగు ముందునకు వైచి వెనుకకుఁ దిరిగెను. తుదకు ధైర్యము తెచ్చుకొని యంతఃపురద్వారము నొద్దకువచ్చెను. కోటలోనివారందఱును వినోదములలో మునిఁగియుండిరి. ఆమె నెవ్వరును జూడలేదు. చూచినవారైన నామెను బలుక రింపలేదు. అందఱు దన్నుఁ జూచుచుండి రనియే యామె యనుకొనియెను. ద్వారపాలకు లందఱును త్రాగి నిద్రించు చుండిరి. మెలఁకువగ నున్నవారు స్మృతితప్పి పడియుండిరి. ద్వారపాలకవేషముతో నొకపురుషుఁ డచ్చట నుండెను. ఆతఁ డామెం జూచి 'అమ్మా! ఉంగరమున్నదా?' అని యడిగెను. తిలోత్తమ తత్తరముతో నుంగరము నాతని కిచ్చెను. ఆతఁడు బాగుగఁ బరికించి తనయుంగర మామెకుం జూపి 'అమ్మా! నిర్భయముగ నాతోరమ్ము' అనియెను. తిలోత్తమ యాతనితోఁ బోయెను. అంతఃపురద్వారపాలకుల వలెనే యందరు ద్వారరక్షకులును వివశులైయుండిరి. అన్ని ద్వారములును తెఱచియేయున్నవి. ఎవ్వరు నడ్డుపెట్టలేదు. ఎన్నియోద్వారములు మందిరములును గడచి తుదకు వారు సింహద్వారమునొద్దకు వచ్చిరి.

అప్పు డాసేవకుఁడు తిలోత్తమతో "అమ్మా! ఎక్కడకుఁ బోవలయును?" అని యడిగెను. తిలోత్తమకు విమల చెప్పిన ట్లభిరామస్వామియొద్దకుఁ బోవలెనని లేదు. ఆమె

హృదయమున జగత్సింహుఁడుండెను. ఆతనియొద్దకుఁ దీసికొని పోమ్మని యడుగఁ దలఁచి సిగ్గుచేఁ జెప్పలేక పోయెను. "ఎక్కడకుఁ బోవుదము?" అని యాతఁడు మరల నడిగెను. ఆమె వివశయై చెప్పలేకపోయెను. ఆమెకుఁ దెలియకుండ హృదయము కొట్టుకొనుచుండెను. కన్నులు చీఁకట్లు గ్రమ్మెను. చెవులు వినఁబడుటలేదు. ఆమె చిఱుపెదవులనుండి యామెకుఁ దెలియకుండ నస్పష్టముగ "జగత్సింహుఁడు" అను నక్షరములు వెలువడియెను.

"జగత్సింహుఁడు చెఱయందున్నాఁడు. ఎవ్వరు నచ్చటికిఁ బోఁగూడదు. అయినను నీయిచ్చవచ్చినచోటికిఁ దీసికొనిపోవుట నాపని. అమ్మా రమ్ము" అనిచెప్ప యామెను వెంటఁబెట్టుకొని మరలఁ గోటలోనికిఁ దీసికొనిపోవుచుండెను. ఒడలెఱుఁగకుండ నామె యాతనివెనుకనే పోవుచుండెను. కోటలోని ద్వారపాలకులవలెఁ గారాగృహరక్షకులు త్రాగి యుండలేదు. వారప్రమత్తులై కావలి కాచియుండిరి. ఆపురుషుఁడు వారిమూలమున రాజపుత్రునిసంగతి తెలిసికొని యస్మానుఖానుని యుంగరముంజూపి యందుమూలమున జగత్సింహుఁ డున్న చెఱసాలతలుపులను దీయించెను.

జగత్సింహుఁడు మంచముపైఁ బరుండి యుండెను. తలుపుచప్పుడగుటను విని యాశ్చర్యముతో లేచి చూచెను. తిలోత్తమ ముందునకుఁబోలేక ద్వారమునొద్ద నిలువఁబడియుండెను. ఆమెకాళ్లు సాగుటలేదు. అక్లే నిలువఁబడిపోయెను. ఆపురుషుఁడు లోపలకుఁ బోవచ్చుననియెను. అప్పటికిని తిలోత్తమ కదలలేదు. ఇష్టములేకున్నచో నాలస్యముచేయక రమ్మని

యూతఁడు హెచ్చరించెను. ఆతనితొందరచేఁ దిలోత్తమ వెనుకకుఁ దిరుగఁ దలంచెను గాని యట్లును జేయలేకపోయెను. తుద కామెయొక్కయడుగు వైచి గదిలోఁ బ్రవేశించెను. ఎట్లు నడచినదో యామెకే తెలియదు. ఆమెకు జగత్సింహుఁ డగపడియెనో లేదో కాని యామె ముందున కొక్కయడుగు పెట్టలేకపోయెను. అట్లే తలవంచుకొని గోడనానుకొని నిలువఁబడిపోయెను.

అర్ధరాత్రివేళ నొకయంగన యచ్చటికి వచ్చినందులకు జగత్సింహుఁ డాశ్చర్యపడియెను. ఆతఁడు తిలోత్తమ నానవాలు పట్టలేదు. కాని లోపలకువచ్చియు రాకుండ నిలువఁబడి పోయినందులకు వింతపడుచు లేచి తలుపునొద్దకువచ్చి యామెంజూచి యానవాలుపట్టెను. ఇరువురిచూపులు నొక నిమిషములో నేకీభవించెను. తిలోత్తమ యంతలోఁ దలవంచుకొనియెను. ఆతనిపాదములపైఁ బడవలయునని యెంచుక వంగునంతలో నాతఁడు వెనుకకుఁ బోయెను. ఆమె చిత్రము వలె నిలువఁబడిపోయెను. నిమిషముక్రింట వికసించిన యామె హృదయకుసుమ మిప్పు డిట్లే వాడిపోయినది.

అప్పు డు జగత్సింహుఁడు 'ఈమె వీరేంద్రుని కూఁతురా?' అనియెను. ఆమాట యామె కశనిపాతముకంటెను బాధాకర మయ్యెను. ఇట్టిసమయమున నాతఁ డిట్లేనా పలుకవలసినది? జగత్సింహుఁ డామెపేరె మఱచిపోయియుండునా? కొంత సేపటివఱకిరువురును మాటలాడలేదు కొంతసేపటికి జగత్సింహుఁడు 'ఇచ్చట కేలవచ్చితివి?' అని యడిగెను. అది యేమి ప్రశ్న? తిలోత్తమ తల తిరుగఁ జొచ్చెను. సమీపవస్తువులతో

గదియును ప్రపంచమునుగూడఁ దిరిగిపోవుచుండెను. ఆమె తలను గోడకుఁ జేరవైచెను. ప్రత్యుత్తరముకొఱకు జగత్సింహుఁడు నిరీక్షించెను. ప్రత్యుత్తరమెట్లు వచ్చును? ఇఁక నాతఁడాయాశ వదలుకొని 'అయ్యో! నీకు విచారముగ నున్నది కాఁబోలును! పాపము! పొమ్ము! వెనుకటిసంగతి యంతయు మఱచిపొమ్ము' అనియెను.

తిలోత్తమకుఁ గలసంశయము లన్నియును వదలిపోయినవి. ఎండుటాకు చెట్టునుండి రాలునట్లామె క్రిందఁ బడిపోయెను.



## పదునాలుగవ ప్రకరణము.

తిలోత్తమ స్పృహతప్పి పడిపోయినది. ఆమెకింకను దెలివివచ్చునట్లు తోఁచుట లేదు. జగత్సింహుఁడు తనయుత్తరీయముతో నామెకు విసరుచు నామెతో వచ్చినవానిం బిలిచి 'ఈమె మూర్ఛిల్లినది. దాసి యెవ్వతెయైన వచ్చినదేమో వచ్చి చూడు మనుము' అని చెప్పెను. ఆతఁడు 'నేనొక్కఁడనే వచ్చితి' ననియెను. 'ఆలాగా?' అని జగత్సింహుఁడు నివ్వెఱపడియెను. కొంతసేపైన తరువాత నాతనిం జూచి 'ఈమె కుపచారము చేయుటకై యెవ్వతెనైన నొకదాసిని దీసికొనిరాఁగలవా? పాపము! ఈయుత్సవసమయమున నీ కెవ్వరు పలుకుదురు? ఇంతేకాక యిది రహస్యచర్య. కారాగారమునకు మఱి యెవ్వరినిగూడ రానీయరు. కాని యొక్కపని చేయుము. ఈ సంగతి యంతయు నయేషాకుఁ దెలియఁజేయఁగలవా!' అనియెను.

ఆపురుషుఁ 'డక్లే' యని వెడలిపోయెను. జగత్సింహుఁడే యంతవఱకు నామె కుపచారకుఁడై యుండెను. అప్పు డాతని హృదయ మెట్లుండెనో యెవ్వరి కెఱుక? ఆతనికన్ను లశ్రువుల విడుచుచుండెనేమో మనకుఁ దెలియదు. అతఁ డేమియుఁ దోఁచక యక్లే నిర్విణ్ణుఁడై యుండెను. తిలోత్తమ కప్పుడే యించుక తెలివి కలుగుచున్నది. ఇంతలో మేలిముసుఁగు వైచుకొనియున్న యిరువురు స్త్రీలతో నాపురుషుఁ డచ్చటికి వచ్చెను. పరిచారికాసహితయై యయేషా[illegible] జగత్సింహుఁ డనుకొనియెను. వారు [illegible] ద్వారమునొద్దకు వచ్చిరి. ద్వారపా[illegible]వారిని లోనికి బోనీయ ననియెను.

అయేషా మేలిముసుఁగుఁ [illegible] 'మమ్ముఁ బోనిమ్ము. నీకేమియును భయము లేదు. నీతలమీ[illegible]కి వచ్చినప్పుడు నేరము నాపై బెట్టుము.' అని ద్వారపాలకుని[illegible]రించెను. అతఁ డయేషాను జూచి వందనముచేసి మ[illegible]కుండ లోనికిఁ బోనిచ్చెను. అయేషా లోపలఁ బ్రవేశించి రాజ పుత్త్రునకు నమస్కరించి 'ఏమిది?' అనియెను. ఆతఁ డేమని చెప్పఁగలఁడు? పడియున్న తిలోత్తమ నామెకుఁ జూపెను. అయేషా చూచి 'ఈమె యెవ్వరు?' అనియెను.

జగ—వీరేంద్రుని తనయ.

ఆసందర్భమున మఱియొక యువతియైనచో నెంతయో సంశయించును. అయేషా అట్టిది కాదు. ఆమె తిలోత్తమ నొడిలోఁ జేర్చుకొనియెను. అయేషా యేమిచేసినను విలాస ముగనే యుండెను. విలాసమయియగు నామె తిలోత్తమ నెత్తి

కొనుటకూడ జగత్సింహునకు మనోహరముగఁ దోఁచెను. దాసిచేఁ దెప్పించినపన్నీరు మొదలగు శీతలద్రవ్యములచే నయేషా తిలోత్తమ కుపచారము చేయుచుండెను. అందువలనఁ దిలోత్తమకు బాగుగ స్మృతి కలిగెను. కన్నులువిచ్చి నలుదంకలఁ జూచెను. వింతగా నుండెను. ఆమె తటాలున లేచి యవ్వలకుఁ బోపోయెను గాని నీరసముచే నడవలేక పోయెను. అయేషా యామెను బట్టుకొని 'సోదరీ! నీ కేమియు భయము లేదు. నాతోఁగూడ రమ్ము. నీవు నెమ్మది పడువఱకు నాభవనమున నుండుము. తరువాత నీవుకోరిన చోటికి నిన్నుఁ బంపెదను' అనియెను. తిలోత్తమ మాటాడలేదు. అయేషా యామెను దీసికొని వచ్చినవానివలన సంగతి యంతయును దెలిసికొని తిలోత్తమ భయపడుచున్నదని గ్రహించెను.

అయేషా తిలోత్తమచేయి పట్టుకొని 'అక్కా! నామాట నమ్ముము! నీవిరోధిననియ నని సందేహింపకుము. నీసంగతి నాకుఁ దెలిసిపోయినదని భయపడకుము. [illegible] వాపులోపలనే యెవ్వరికిని దెలియకుండ నీకోరినచోటికి నిన్నుఁ బంపెదను' అనియెను. అమృతమయములగు నయేషామాటలవలనఁ దిలోత్తమ కింతమాత్రమును సంశయ మగపడలేదు. ఆమె నడువలేదు. జగత్సింహునియెదుట నిలువ లేదు. ఇంకేమి చేయును? అయేషా చెప్పినట్లు యొప్పుకొనియెను. అయేషా సంతసించి 'నీవు నడవలేవు. దాసిసాహాయ్యమునఁ బయలుదేరఁ గలవా?' అనియెను.

తిలోత్తమ పరిచారిక నూతచేసికొని మెల్లఁగ నడుగు వేయసాగెను. అయేషా సెలవుదీసికొనుటకై రాజపుత్రునివంకఁ

జూచెను. రాజపుత్రుఁడామెవంక నదేవిధముగఁ జూచెను. ఆచూపులో నేదియో మాటాడఁదలఁచిన భావము ద్యోతకమగుచుండెను. ఆసంగతి నయేషా తెలిసికొని పరిచారికతో 'నీ వీమెను దీసికొని పోయి నాపడకయింటనుంచి నన్నుఁ దీసికొనిపోవుటకై మరల రమ్ము' అని చెప్పెను.

పరిచారిక యామెను దీసికొనిపోయెను. రాజపుత్రుఁడు నిట్టూర్పువిడిచి 'ఈచూపే కడసారిచూపు' అని యనుకొనియెను. అగపడుచున్నంతవఱకు కాతఁడు తిలోత్తమ వంకఁ జూచెను 'సెలవే కడసారిసెలవు' అని యనుకొనుచుఁ దిలోత్తమ పోవుచుండెను. తనకు జగత్సింహుఁడగపడునని తోఁచునంతవఱకు కామె తిరిగి చూడలేదు: ఆమె తిరిగి చూచునప్పటికి కామెకుఁ బ్రియునిదర్శనము కాలేదు.

## పదునైదవ ప్రకరణము.

వారు వెడలిపోయినతరువాత నయేషా లోపలికిఁ బోయి రాజపుత్రునిశయ్యపైఁ గూర్చుండెను. తాను గూర్చుండుట కేదియుసులేక జగత్సింహుఁడు నిలువఁబడి యుండెను. అప్పుడయేషా తనతలనున్న గులాబీపూవును దీసి యొకొక్కరేకయు నూడఁదీయుచు 'రాజకుమారా! నీ చూపులనుబట్టి నీవు నాతో మాటలాడఁదలఁచినట్లు గ్రహించితిని. నావలన నీ కేమైనఁ గావలసిన పనియున్నయెడల నిస్సందేహముగ నాజ్ఞాపింపవచ్చును. నేను నాచేత నైనంతవఱకు సంతోషముతో నీ సేవ చేయుదును' అనియెను. 'నా కేమియును గావలసినపని లేదు. నాపనికొఱకు నేను నీతో మాటాడఁదలంపలేదు. నాకిఁక

వరల నీదర్శనము లభించు నను నాశ లేదు. ఇదియే కడసారి యనుకొనియెదను. నేను నీకప్పుపడి పోయితిని. ఇట్లు చెప్పుట వలన నేమిప్రయోజనము? నాయవస్థనుబట్టి నీ ఋణ మెన్నటి కైనఁ దీర్చికొనఁగల ననునమ్మకము కలుగుట లేదు. కాని, యెప్పుడైన నీకుపకారము కావలసి వచ్చినప్పుడు—భాగ్యవశ మున నాయుపకారము చేయఁగల సామర్థ్యము నాకలవడి నప్పుడు—నీవు నన్నుఁ గోరుట కెంతమాత్రమును సందేహింప వలదు. అట్టిసమయమున నీయన్నతో నెట్లు మాటాడెదవో యట్లే నాతోడను మాటలాడవలయును' అని చెప్పునప్పుడు జగత్సింహునికంఠస్వరము కంపింపసాగెను. అయేషా నిలువు నీతై కొంతసేపుండి 'రాకుమారా! నిరాశపడకుము. నేటికష్ట ములు రేపుండవు!' అనియెను.

జగత్సింహుఁడు దీనవదనుఁడై 'నాకు నిరాశ లేదు. ఆశ యును వదలిపోయినది. నేనెందులకు జీవింపవలయును? ఈలోక మును విడుచుటకంటె నాకేకోరికయును లేదు. కాని యది యీ చెఱయందుమాత్రము కాఁగూడదు' అనియెను. అయేషా హృదయము కలఁగిపోయెను. స్త్రీస్వభావమగుకరుణచే నామెకు సిగ్గు మితభాషణము మొదలగు సహజగుణములు వదలిపోయి నవి. ఆమె జగత్సింహుని చేయిపట్టుకొని కొంతసేపటివఱకు నాతనిమొగమువంకఁ జూచి యనంతరము "రాకుమారా! ఈ పరితాప మెందులకు? నన్నుఁ బరాయిదానిగాఁ జూడకుము. ఒక్కమనవి. వీరేంద్రసింహుని తనయ—"

అని యింకఁ జెప్పుచుండఁగ జగత్సింహుఁడు 'ఆమాట యె త్తకుము. కలవలె నదియంతయుఁ గల్లయైపోయినది. క్షమి

యింపుము' అనియెను. కొంతసేపటివఱకు నిరువురును మాట లాడలేదు. ఒండొరులు హస్తములను బట్టుకొనియే యుండిరి. అయేషా యట్లె తలవంచికొనియెను. జగత్సింహునిహస్తమున నొక్కవేఁడి కన్నీటిచుక్క పడియెను. ఆతఁడు తలవంచి చూచు నప్పటి కయేషాకన్నులు బాష్పపూరితములైయుండెను. జగత్సింహుఁడు సంభ్రమముతో 'అయేషా! ఇదియేమి?' అనియెను. అయేషా మాటలాడకుండ నాతనిఁ దనపార్శ్వమునఁ గూర్చుండఁ బెట్టుకొనియెను. 'రాజకుమారా! నీతో నిట్లు మాటలాడవలసి వచ్చునని నాకలనైనఁ దలంపలేదు. నీవీకారాగృహమున ననుభవించుపరితాపముం జూచి నేను సహింపఁజాలను. నాగుఱ్ఱపులాయమునుండి యొకగుఱ్ఱమును నీ కిప్పించెదను. నామనవి విని యీరాత్రియే బయలుదేరి నీతండ్రియొద్దకుఁ బొమ్ము' అనియెను.

అదృష్టదేవత ప్రత్యక్షమైనను జగత్సింహున కంత వింతగా నుండదు. ఆతఁ డట్లె నివ్వెఱపడి చూచుచుండెను. మాటాడలేకపోయెను. అయేషా రమ్మురమ్మని బలవంతము చేయఁజొచ్చెను.

జగ—అయేషా! నన్ను విడిపించెదవా?

అయే—ఆ.

జగ—మీతండ్రికిఁ దెలియదా?

అయే—ఆసందేహ మక్కఱలేదు.

జగ—ఈద్వారపాలకు లొప్పుకొందురా?

అయే—ఈయుంగరమున్నదికాదా? ఇది యెంతపనియైనఁ జేయఁ గలదు.

జగ—ఈసంగతి తెలిసినప్పుడు మీతండ్రి నీపైఁ గోప పడఁడా?

అయే—పడుఁగాక! నీరక్షణముకంటె నా కాకష్టము లెక్కయా?

జగ—అయేషా! వద్దు, నేనిచ్చటనే యుండెదను.

అయే—(తెల్లపోయి) ఏమి?

జగ—నేనిదివఱకే నీకప్పుపడి యుంటిని. అది నాప్రాణము నిచ్చినను దీరదు. ఇంకను నీకు గష్టమునే కూర్పవలయునా?

అయే—ఆసంశయము వలదు. నామాట వినుము.

జగ—నే నట్లు చేయను.

అయేషా మాటలాడలేకపోయెను. కన్నీటి నాపుకొనఁ దలంచెను గాని యెంతయడఁచికొనినను లాభములేకపోయెను. "అయేషా! యెందుల కేడ్చెదవు?" అని జగత్సింహుఁ డనియెను. ఆమె మాటాడలేదు. జగత్సింహుఁడు మరల "అయేషా మాటాడవేమి? ఎందుల కేడ్చుచుంటివో చెప్పవా? నీదుఃఖశాంతికొఱకు నాప్రాణమైన నొసంగెదను. నేను చెఱయందుంటి ననియా? ఇందు నావంటివా రెందఱు లేరు?" అనియెను. అయేషా కన్నీరు తుడుచుకొని 'నేనిఁక దుఃఖమును వదలియుందును' అనియెను. ఆమె తనదుఃఖ కారణమును దెలుప నందులకు జగత్సింహుఁడు విచారించెను. ఇరువురును దలవంచికొని యట్లే యుండిరి. ఇంతలో నెవ్వరోయచ్చటకు వచ్చిరి. ఆతని నాయిరువురిలో నెవ్వరునుజూడలేదు. ఆవచ్చినయాతఁ డట్లే కొంత

నేపుండి క్రోధకంపితస్వరముతో 'రాజకుమారీ! ఇది మహాప రాధము' అనియెను.

ఆమాట విని వారు తలయెత్తి చూచిరి. ఆతఁడస్మాను ఖానుఁడై యుండెను. తిలోత్తమతో వచ్చినసేవకునివలన నస్మా నున కీసంగతి తెలిసెను. అందుచే నాతఁడయేషాను వెదకుచు నిట్లు వచ్చెను. జగత్సింహుఁడస్మానునిజూచెను. అయేషాకెవరి వలన నేమియాపద కలుగునోయని యింతవఱకును భయపడు చున్నయాతని కస్మానుమాట మఱింత భయకారణ మయ్యెను. అయేషా నిమిషములో నస్మానుభావమును గ్రహించెను. ఆమె మనోహరవదనమండల మించుక యెఱ్ఱనైనను గాని యశాంతిచిహ్నము లేమియు నగపడుట లేదు. ఆమె నెమ్మదిగా 'అస్మాన్! మహాపరాధ మేమి?' అనియెను. అస్మాను పరుష స్వర ముతో 'న్యాయవిరుద్ధముగ రాజకుమారిక చెఱలోనున్నయొక యపరాధితో గలసియుండుట మహాపరాధము కాదా?' అని యెను.

ఏదోషము నెఱుంగనినిష్కళంక యగునయేషా యస్మా నుని మాటలకు సహింపలేక పోయెను. ఆమె యాతనివంకఁ దీవ్రముగఁ జూచుచు 'నాయిష్టము చెఱసాలకువచ్చి యితనితో మాటలాడుట నాయిష్టము. నామంచి చెడ్డలను నిర్ణయించుటకు నీవు తగవు. ఇందు నీకేమియు సంబంధము లేదు.' అని తీవ్ర ముగఁ బలికెను. అయేషా యంతతీవ్రస్వరముతో మాటలాడుట యస్మా నిదివఱ కెన్నఁడు జూచియుండలేదు. ఆతఁడు క్రోధా శ్చర్యములతో "రేపు నబాబుగారియొద్దఁగాని నాసంగతి నీకుఁ దెలియదు" అనియెను.

అయేషా తీవ్రస్వరముతోడనే 'మాతండ్రి యడిగినప్పుడు చెప్పెదను. నన్నడుగుటకు నీవెవరు?' అనియెను. అస్మాను 'ఆలాగా? నేనడిగినఁ జెప్పవా?' అనియెను. అయేషా చటాలున లేచి యస్మానువంకఁ దీవ్రముగఁ జూచెను. ఆమె విశాలనయనములు విరళితము లయ్యెను. ముఖపద్మము కాంతిమంతమయ్యెను. నీలాలకములతో నామె తల యించుక ప్రక్కకు వంగెను. మనస్తాపముచే నామె హృదయము చలించుచుండెను. ఆమె స్ఫుటస్వరముతో 'అస్మా! నీవడిగినను చెప్పెదను. ఈతఁడు నాప్రాణేశ్వరుఁడు. వింటివా?' అనియెను.

ఆకస్మికముగ నశనిపాతమయ్యెను. అస్మాను జగత్సింహు లులికిపడిరి. అద్భుతమున మునిఁగిపోయిరి. జగత్సింహుని యంధకారహృదయము మెఱసి పోయెను. అయేషా యెందుల కేడ్చినదో యాతనికిఁ దెలిసిపోయినది. అయేషాయుద్దేశము నస్మానింతకముందే కనిపెట్టియుండెనుగాని తనయెదుట నేయిట్లు చెప్పునని యాతఁ డనుకొనలేదు. ఆతఁడు మాటాడకుండనట్లే యుండెను. అయేషా మరల నస్మానునితో 'ఈతఁడే నాప్రాణేశ్వరుఁడు, నాహృదయమున సూదిమొన మోపునంతటిచోటైన నితరునకు లభియింపదు. ఈతఁడు చెఱనుండి వీడ్వడినను, అట్లుగాక యాతనిరక్తపాతముచే వధ్యస్థానము మునిఁగిపోయినను నా హృదయపద్మమున నీతఁడే సేవింపఁబడుచుండును. ఈతఁడు బహుభార్యాపరివృతుఁడైనను, నే నీతనినే ప్రేమించెదను. అయేషా యపకీర్తిపాలైనను నామె తనకంఠమునఁ బ్రాణము లుండఁగా నింకొకనిఁ బ్రాణేశ్వరునిగ భావింపదు. ఈద్వారపాలకుల నెట్లో యొప్పించి యాతని కొకగుఱ్ఱమునిచ్చి యామూల

మునఁ జెఱనుండి తప్పింపఁ జూచితిని. కాని యీయుత్తమ క్షత్రియవీరుఁ డందుల కియ్యకొనలేదు. అక్కఱయైనచో నిప్పటికి నీవీతని పరిచిహ్నములనైనఁ జూడలేక యుందువు. కానిఅస్మాన్! నిన్నుఁ జాల గష్టపెట్టితిని. క్షమియింపుము. నే నీతని బ్రేమించితిని. నేను కఠినురాలిగ నీ కగపడవచ్చును. నా సతీత్వమునకు శంకింపకుము. అయేషాకుఁ గళంకమనుమాట లేదు. మంచిదైనను జెడ్డదైన నామె చేసినదాని నొప్పుకొని తీరును. ఇప్పుడు నీతోఁ జెప్పితిని. అడిగినచో మాతండ్రితోఁగూడ నిట్లే చెప్పెదను' అని పలుకుచు జగత్సింహుని వంకఁజూచి 'రాజకుమారా! నీవును నన్ను మన్నింపవలయును. అస్మాను నాహృదయమును నొప్పింపకుండినచో హృదయసంతాపపూర్వకములగు నీమాటలు మీచెవులనే కాదు లోకమునం దెన్నఁడు నెవ్వరికిని వినఁబడకయే పోయియుండును' అనియెను.

పరితాపతప్తహృదయుఁ డగు జగత్సింహుఁడు మాటాడలేదు. అస్మానును మాటలాడలేదు. మరల నయేషా 'అస్మాన్! నామాటలు నీకుఁ గష్టములుగఁ దోచినచో క్షమియింపుము. నేను నీసోదరి. ఆజన్మాంతరము నిట్లే సోదరిని. నాపైఁ బ్రేమ విడువకుము. దురదృష్టముచే నగాధసముద్రమునఁ బడిపోవుచున్ననాకు సోదరప్రేమ కలుగఁజేయకుము' అని చెప్పుచు దాసి వచ్చెనని నుండక వెడలిపోయెను. అస్మానుఁడును హైతన్యశూన్యుఁడై యుంటికేఁబోయెను.

## పదునాలవప్రకరణము.

మొగలాయిరాజులవలెఁ గటులూఖానునకుఁ బనజన్మమున వర్షాపసమనోవిముతోఁ గాలక్షేపముచేయు నాచా

రము లేదు. ఆతఁడు స్వార్థపరుఁడును విషయలోలుఁడును నగు
టచే నంతఃపురవినోదములే యతని కానందదాయకములు.
ఆతఁ డారాత్రియంతయును రాణులతో వినోద మనుభవించు
చుండెను. అట కొజ్జాలుతప్ప మఱెవ్వరును లేరు. కొందఱు
రాణు లాడుచుండిరి. కొందఱు పాడుచుండిరి. కొందఱు వాద్య
ముల నెఱపుచుండిరి. కొంద ఱాతనిఁ బరివేష్టించి యాతనితో
నానందించుచుండిరి. విషయోపభోగ్యంబు లగునెల్లవస్తువు
లందు నిండియుండెను. పరిమళమిళితంబగు చల్లనిగాలి కన్నుల
మిఱుమిట్లు గొలుపు కాచ దీపములు, సుగంధములచే మనోహ
రంబు లగుపుష్పమాలికలు, పూలబంతులు, పూలగుత్తులు,
పూలవీవనలు, ఇంక నెన్నెన్నియో మనోజ్ఞవస్తువు లందుండెను.
కొందఱురాణులు పూలబంతులవిసరుచుండిరి. మఱికొందఱు
పూవుసురటుల విసరుచుండిరి. ఆరాణుల మనోహరాలంకారము
లాదీపకాంతులలో మిలమిలలాడుచుండెను. ఆదీపములకాంతు
లు, ఆపూవుపరిమళము, ఆచల్లనిగాలి, ఆరాజ్ఞీమణుల యలం
కారవిలసనము, సంగీతము, నృత్యము మొదలగునవన్నియును
కటులుఖానునిహృదయము నానందతన్మయముగఁ జేసి వైచు
చుండెను.

ఒక యువతీమణి యతివిలాసముగ నృత్యము చేయు
చుండెను. ఆమె తరంగములనడుమఁ జలించు తామరాకుపై
నున్న రాయంచ చేడియవలె మనోహారిణియై యుండెను. అంద
ఱికన్నుల నామెయే యాకర్షించుచుండెను. అంతయును రమ
ణీమయము. అంతయును రామణీయకమయము. అంతయును
విలాసమయము. అంతయును వినోదమయము. కటులుఖానున

కా రాత్రి యంతయు నానందమయముగనే యుండెను. చక్కని చుక్కలనడుమఁ జంద్రునివలె రాణులనడుమఁ గటుల్‌ఖాను విలసిల్లుచుండెను. ఆసుందరీమణు లొకరికంటె నొకరు చక్కనివారు. ఒకరికంటె నొకరు చక్కగ నలంకరించుకొని యుండిరి. ఒకరిని మించి యొకరు నాథుని వినోదపెట్టుచుండిరి.

అప్పు డొకయువతీమణి కటుల్‌ఖానుచెంత నతివిలాసముగఁ గూరుచుండి కనకపాత్రమునఁ గుసుమాసవమును నింపుచుండెను. కిలకిల నవ్వుచున్న యామెచూపులలోఁ గటుల్‌ఖానుని హృదయము లగ్నమైపోవుచుండెను. ఆతనిచూపు లామె సుందరాకారమునందే ముగ్ధములైపోవుచుండెను. ఆమె యొయ్యారమున నాతనివంకఁ గొసరికొసరి చూచుచు జిఱునవ్వుతోఁ గుసుమాసవము నాతనికిఁ గొసరికొసరి యిచ్చుచుండెను. ఆతఁ డక్లే త్రాగుచుండెను ఆమె నవ్వుచుండెను. ఆనవ్వు సామాన్యమైనది గాదు. కటుల్‌ఖా నామెనే చూచుచుండెను. ఆమె గానము చేయుచున్న రాణులతోఁ గలసిపాడుచుండెను. కటుల్‌ఖా నాపాటనే యాలకించుచుండెను. ఆమె మరల మధుపాత్రమును దెచ్చియిచ్చెను. కటుల్‌ఖానునకు తదేకానందమే కాని వేఱేమియు లేదు. ఆచిఱునవ్వు—ఆ యొయ్యారము—ఆ లావణ్యము—ఆ విలాసము—ఆతఁ డామెకే వశుఁడై పోయెను. ఆయొక్కతికే లోఁబడిపోయెను. వలపు చూపులతో నామె యిచ్చినపానపాత్రముకంటె నాతనికిఁ గోరఁదగిన దేమున్నది? కటుల్‌ఖానుఁడు మంత్రముగ్ధునివలె నైపోయెను. ఆమెచూపులలో దేలిపోయెను. ఆమె విలాసమునకుఁ జిక్కి—

పోయెను. అగాధమగు మోహసముద్రమున మునిఁగిపోయెను. ఆమనోహారిణి యెవరు? ఆమె విమల.

ఆవిలాసవతి యక్లే సవిలాసముగఁ బానపాత్రమును నింపుచుండెను. ఆతఁడు దానిని మధువిహీనముగఁ జేయుచునే యుండెను. కటులూఖానునకు దూరదృష్టి లేకపోయినది. ఆత నికిఁ గ్రమముగ స్మృతితప్పిపోవుచున్నది. ఇంకనుగావలయును కావలయును అని యాతఁడు తొందర పడుచుండెను. విమల మందహాసకటాక్షములతో నక్లే పానపాత్రము నింపు చుండెను. కటులూఖా నున్మత్తునివలెఁ జరింప నారంభించెను. సమీపముననున్న రాణులు నవ్వుచు వెడలిపోయిరి. అంతలో జటాలున దీపమారిపోయెను. కటులూఖానుఁడు 'మనోహారిణీ!' యనిపిలిచెను. విమల యాతనిభుజముపైఁ జరచి 'నీసేవకురాలు నీయొద్దనే యున్నది' అని చెప్పుచుఁ గత్తిని రెండవచేతఁబట్టు కొని యుండెను. కటులూఖానుఁడు సంభ్రమముతో నామెను కౌఁగిలించుకొనియెను. ఆమె తనకటారి నాతనివక్షస్థలమున గ్రుచ్చివైచెను. కటులూఖానుఁడు కెవ్వననార్చుచు శయ్యపైఁ బడిపోవుచు 'చీ దురాత్మురాలా!' అని కంపితస్వరమునఁ గేక వైచెను.

'నేను దురాత్మురాలను గాను, కీర్తికాయుఁడగు వీరేంద్ర సింహాని యిల్లాలను' అని పలుకుచు విమల వెడలిపోయెను. కటులూఖానుఁడు రోదనము చేయుచుండెను. విమలకూడ నేడ్చుచు దత్తరమునఁ బరుగెత్తుచుండెను. ఆమె యేడ్పును జూచి ద్వారరక్షకులగుకొజ్జాలు 'అదియేమి?' అని యడిగిరి. ఆమె తత్తరమున 'త్వరపడుఁడు! త్వరపడుఁడు! రాజద్రో

హాలు నబాబుగారిని బొడిచియుందురు' అని చెప్పెను. అందఱు నలజడిపడుచు నన్ని త్రోవలను లోపలకుఁ బరువెత్తిరి. విమల నిరంతరాయముగ నాద్వారమును దాఁటిపోయెను. ఆమె యిల్లు తప్పించుకొనిపోవుచుఁ గడపటిద్వారము కడకువచ్చెను. అచ్చటివారు జాగరూకులై యుండిరి. విమల యుచ్చస్వరముతో 'మీరిక్కడ నేమి చేయుచున్నారు. లోపలఁ గోటలో గందర గోళ మగుచున్నది నబాబుగారి నెవ్వరో చంపిరఁట! ఆగోల వినపడుట లేదా?' అనియెను. అందఱును లోపలకుఁ బరు గెత్తిరి. విమల నిరాఘాటముగ దుర్గమునుండి విడివడి కొంత దూరముఁ బోవునప్పటి కచ్చట నభిరామస్వామి యగపడెను.

ఆతఁడు విమలంజూచి 'ఆకలకలలేమి?' అని యడిగెను. 'పగతీరిపోయినది. త్వరగ నింటికిఁ బోదము. పద తరువాత నంతయుఁ జెప్పెదను. తిలోత్తమ వచ్చినదా?' అనియెను. 'అష్మాసీ యామెనుదీసికొనివచ్చుచున్నది. వారినిగలిసికొందము' అని విమల చెప్పెను.

వారు కుటీరమునఁ బ్రవేశించునప్పటి కయేపాదయు వలన నాష్మాసీయును, తిలోత్తమయు సురక్షితముగఁ జేరికొనిరి. తిలోత్తమ యభిరామస్వామిపాదములపైఁబడి యేడ్చెను. ఆతఁ డామె నూఱడించుచు 'అదృష్టవశమున దుష్టులబారి నుండి విడుదలఁబడితిమి. ఇఁక నిటనుండరాదు. పఠానులు మనల నానవాలుపట్టి రాజద్రోహపు నేరమునకై మనలఁ జంపెం పకమానరు. ఈరాత్రియే పోవుదము' అనియెను. అందుల కందఱు నంగీకరించిరి.

---

## పదునేడవ ప్రకరణము.

---

కోటనుండి విమల వెడలినతోడనే యొకరాజోద్యోగి చెఱసాలయొద్దకు వచ్చి జగత్సింహునిం గాంచి 'అయ్యా! ఈ యవసానసమయమున మానబాబుగారు మిమ్ముఁ జూడఁ గోరుచున్నారు' అనియెను. జగత్సింహుఁ డాశ్చర్యావిష్టుఁడై 'అది యేమి' అనియెను.

ఉద్యో—విరోధు లెవ్వరో లోపలఁ బ్రవేశించి యాతనిబొడిచివైవినారు. ఇంక నాతఁ డెంతయోసేపు బ్రదుకఁడు. త్వరగ రమ్ము. ఆలస్యము చేసినఁ బ్రయోజనము లేకపోవచ్చును.

జగ—ఆతఁడు నన్నుఁ జూడఁగోరు టెందులకు?

ఉద్యో—నాకెట్లు తెలియును? ఆజ్ఞ ప్రకారము నిన్ను వెంట బెట్టుకొని పోవుటకే వచ్చితిని.

జగత్సింహుఁ డాతనితో బయలుదేరెను. అప్పటి కింకను కటులుఖాను జీవములతోనే యుండెను. ఆప్రాణము లారిపోవుచున్న దీపములవలె నధికదీప్తి మంతములై యుండెను. ఇంకఁ గొలఁది సేపటిలో స్థిరమైన గాఢాంధకారము వ్యాపింపనున్నది. రాణులు, అయేషా, అస్మాను, రాజోద్యోగులు మొదలగువారాతనిఁ బరివేష్టించియుండిరి. అంతఃపురమంతయు రోదనధ్వనులతో మారు మ్రోగుచుండెను. ఏమియు నెఱుంగని పసిబిడ్డలుగూడ నేడ్చుచుండిరి. అయేషాయొక్కతె మాత్రము గట్టిగ నేడ్చుట లేదు. ఆమె చెక్కులనుండి వేఁడికన్నీటిధారలు కాలువలు గట్టుచుండెను. ఆమె తనతండ్రితల నొడిలోఁ జేర్చుకొని కూరుచుండెను. ఆమెనోట మాటలేదు. నివాతదీపము

వలె నిచ్చలరైయున్న యామెను జగత్సింహుఁడు చూచెను. ఖ్వాజా యను రాజోద్యోగి యాతని చేయిపట్టుకొని నబాబు నొద్దకుఁ గొనిపోయి బిగ్గరగా 'మహాప్రభూ! జగత్సింహుఁడు' అనియెను. కటుల్‌ఖా నించుక కన్నెత్తిచూచి హీనస్వరమున జగత్సింహునితో 'అయ్యా! నీశత్రుఁడ నగునేను చచ్చిపోవు చున్నాను. ఇఁక నాకీలోకముతోఁ బ్రయోజనము లేదు. నీవు నాయెడలఁ గోపమును వైరభావమును విడిచిపెట్టుము' అనియెను.

జగ__అలాగే.

కటుల్__ఇంకొక మనవి__ఒక్క వాగ్దానము__

జగ__ఏమిది?

కటుల్__నీదక్షిణహస్తము__

అప్పు డస్మాను జగత్సింహునిచేతిని కటుల్‌ఖానుచేతి యందుంచెను. జగత్సింహుని సర్వాంగముల నగ్నిజ్వాల యుదయించినట్లయ్యెను. కాని యాతఁడు సహించియుండెను. కటుల్ ఖాను మరల మెల్లఁగా 'నాబిడ్డలు__మరణము__దాహము దాహము' అనియెను. అయేషా పర్బతుతో నాతని పెదవులఁ దడిపెను. మరల నదేస్వరముతో నాతఁడు 'పోరు__నష్టము__ పొందు__లాభము__' అని చెప్పి మఱి మాటాడ లేదు. జగత్సింహుఁడు బదులు చెప్పలేదు. కటుల్‌ఖాను జగత్సింహుని ప్రత్యుత్తరమునకై యాతనిమొగమువలననే చూచు చుండెను. ఆతఁ డేమియుఁ జెప్పకుండుటచేఁ గటుల్‌ఖానుఁ డతికష్టముతో నోపిక తెచ్చుకొని 'నీకిష్టములేదా' అనియెను.

జగ—'పఠానులు, చక్రవర్తికి లోఁబడుట కంగీకరింతురేని నేను సంధికై ప్రయత్నించెదను.'

కటులుఖానుఁ డస్పష్టస్వరముతో 'ఒరిస్సామాట యేమి' అనిగెను.

ఆతని యభిప్రాయము జగత్సింహుఁడు గ్రహించి 'నేను నాయోపినంత వఱకుఁ బని చేసెదను. నా ప్రయత్నము ఫలియించినచో నీబిడ్డ లొరిస్సాయందే సుఖముగ నుండవచ్చును' అనియెను. మరణాయాసమున వికృతమైయున్న కటులుఖాను ని మొగము వికసించెను. ఆతఁ డతిహీనస్వరముతో 'నీవు—నీ యుష్టము—దేవుఁడు—నీకు—మేలు' అనియెను.

జగత్సింహుఁడు పోవుటకు బయలుదేఱుచుండఁగా నయేషా తండ్రి చెవిలో నేమేమో చెప్పెను. ఆతఁడు మొదట ఖ్వాజావంకను బిమ్మట జగత్సింహునివంకను సాభిప్రాయముగఁ జూచెను. అప్పుడు ఖ్వాజా 'రాజకుమారా! నబాబుగారు మీతో నింక నేమో మాటలాడఁగోరుచున్నట్లున్నారు' అనియెను. రాజపుత్రుఁడు నబాబును మరల సమీపించెను. ఆతఁడు 'నీచెలి' అనియెను. జగత్సింహుఁ డించుక ప్రక్కగాఁ బలవంచెను. కటులుఖా నాతనిచెవిలో 'వీర' అని చెప్ప కొంచెము సేపుదేరి 'వీరేంద్రసింహ' అని పలికి నోరెండుకొనిపోవుచున్నట్లు సైగ చేసెను. అయేషాయాతనికి షర్బత్తు నిచ్చెను. ఆతఁడు తేరుకొని 'వీరేంద్రసింహుని కుమార్తె' అనియెను. జగత్సింహునకుఁ గాలభుజంగము కఱచినట్లయ్యెను.

కటులుఖాను మాటలాడలేకుండెను. అయేషా మాటి మాటికి షర్బతు నిచ్చుచుండెను. ఆతని నూపిరియాడుటలేదు.

అతిమందస్వరముతో 'ఆమె యేపాపము—ఎఱుఁగదు. పతివ్రత—పాపము నాది—నేను కాలిపోవుచున్నాను' అనియెను. జగత్సింహుఁడు కటుల్ ఖానుని చెవిలో 'నీయభిప్రాయమేమి' అని యురుమువలె గర్జించెను. కటుల్ ఖాను మరల 'అట్టి సతీమణిని—చూడలేదు. నేను ముట్టలేదు—నీవు—ఎట్లు' అని యిఁకమాటాడలేక యాయాసముచేఁ దల వ్రేలవైచెను. 'అయేషా' అని కడపటిమాట వచ్చెను. ఆతనిదీప మారిపోయినది. అంధకారమువలె మరణ మాక్రమించుకొనియెను. ఆతని ప్రాణవాయువు లెగసిపోయినవి.

## ప దు నె ని మి ద వ ప్ర క ర ణ ము.

జగత్సింహునిచెఱ వదలెను. ఆతఁడు వాగ్దానముచేసిన ప్రకారము మానసింహునొద్దకుఁబోయి పఠానులకును మొగలాయిలకు సంధి జరిపించెను. అప్పుడు వారిసంధి నిబంధనము లన్నియును జరిత్రమున వ్రాయఁబడియున్నవి కావున మేమిప్పుడు వేఱుగ వ్రాయలేదు. తెలియఁగోరువారు చరిత్రమునఁ జూచుకొనవచ్చును. నూతనముగ నలవడినమైత్రి దృఢపడుటకై కటుల్ ఖానుని తనయులను వెంటఁబెట్టుకొని మంత్రియు, నస్మానుఖానును మానసింహుని దర్శింపఁబోయిరి. మానసింహుఁడు వారిని గౌరవించి వారొసంగిన కానుకల నందికొని

రాజపుత్రసైన్య మచ్చటనుండి పాట్నాకుఁ బోవుటకుఁ బయనమయ్యెను. ఆనాఁడు జగత్సింహుఁ డుచితపరివారముతోఁ గోటకుఁబోయి అస్మాను మొదలగుపరిచితులతో మాడలాడ

వలయు నని తలంచెను. ఆరాత్రి చెఱసాలలోఁ గలసినప్పటి నుండియు నొకమాదిరిగ నున్నయస్మానుఖా నప్పుడు రాజపుత్రునితో శాంతమున మాటలాడెను. పిమ్మట జగత్సింహుఁడు విచారహృదయముతో మంత్రియొద్దకుఁబోయి మాటలాడి యయేషామందిరమును జేరెను. ఆతఁడు ద్వారపాలకునిం బిలిచి యయేషా కీక్రిందివిధముగ వార్త నంపెంచెను.

'మీతండ్రి మరణించినతరువాత నాకు నీదర్శనలాభము గలుగలేదు. మరల నెన్నటికి దొరకునో? నేను పాట్నాకుఁ బోవుచున్నాను, నీదర్శనము చేసి సెలవుదీసికొని పోవఁ గుతూహలపడుచున్నాను.

ద్వారపాలకుఁడు లోనికిఁబోయి కొలఁదిసేపటిలోనే తిరిగివచ్చి 'అయ్యా! ఇప్పుడు నేను జూడఁజాలననియు, క్షమింపవలయు ననియు రాజపుత్రిక మీతో మనవిచేయు మన్నది' అని చెప్పెను.

రాజపుత్రుఁడు తెల్లపోయెను. అటనుండి గిరుక్కున మరలి సింహద్వారమునొద్దకు వచ్చునప్పటికి నిరీక్షించి యున్న యస్మానుఖా నాతనిం గలిసికొనియెను. రాజపుత్రుఁ డాతనికి సలాము చేసి బయలుదేరెను. 'ఆతఁడు వెంబడించుచునేయుండెను. అప్పుడు జగత్సింహుఁడు 'అస్మాన్! నాతో మాటలాడ వలసినపని యున్నదా? చెప్పుము! నీయిష్టము నెఱవేర్చుటకంటె నాకుఁ గావలసిన దేమున్నది' అనియెను. అందుపై నస్మానుఖాను 'ఒకరహస్యమున్నది, ఇందఱియెదుటఁ జెప్పవలసినది కాదు. వీరిని బంపివేయుము. నీవు నాతోరమ్ము' అనియెను.

జగత్సింహుఁడు తనపరివారమును బంపివైచి తానస్మానుతో బయలుదేరెను. అస్మానుకూడ గుఱ్ఱము నెక్కెను. ఇరువురును బయలుదేరిపోయి యొకయరణ్యమునఁ బ్రవేశించిరి. అచ్చటఁ బాడుపడిపోయిన మందిరమొకటి యున్నది. రాజద్రోహి యెవ్వఁడో పూర్వకాలమున నందు నివసించి యుండెనేమో? అస్మాను గుఱ్ఱమును దిగి లోపలికి బోయెను. అందొకచో శవమును బాతిపెట్టుట కనువగున ట్లొకగొయ్యి క్రొత్తఁగ ద్రవ్వఁబడియుండెను. కాని యచ్చట శవముమాత్రము లేదు. ఇంకొకచో నప్పుడే పేర్పఁబడిన చితి యొకటి యుండెను. శవమచ్చటను లేదు. జగత్సింహుఁడు లోపలఁ బ్రవేశించి చూచి 'ఇవి యెందులకు?' అని యడిగెను.

అస్మా—వీనిని నేనే సిద్ధము చేయించితిని. నేఁడు నేను చచ్చినచో రెండవకంటివారెఱుంగకుండ నన్నీసమాధిలో బూడ్చెదము. నీవు మరణించినచో నీయుత్తరక్రియలు బ్రాహ్మణులచే నేను జేయించెదను. ఎవ్వరికిని దెలియదు.

జగ—నీయుద్దేశమేమి? నాకేమియు బోధపడుటలేదు.

అస్మా—పఠాణులహృదయమునఁ గ్రోధానలము ప్రజ్వరిల్లినచో నిఁక వారికి మంచిచెడ్డలుండవు. అయేషాప్రేమప్రవాహమున కీలోకమున రెండుత్రోవ లుండరాదు. కావున నిప్పుడు మనలో నెవ్వరైన నొకరు చచ్చి తీరవలయును.

జగ—సరే! ఇప్పు డేమి చేయవలయును.

అస్మా—నీచేతిలో నాయుధమున్నది. నాతోఁ బోరాడి నన్నుఁ జంపి సుఖపడుము. కాదేని నీప్రాణములను విడిచి నాకు శాంతినొసంగుము.

అని చెప్పుచు నాతఁడు మరుమాటకు నిరీక్షింపకయే కత్తి నొరనుండి తీసి పట్టుకొని జగత్సింహునిపైకి లంఘించెను. రాజపుత్రునకుగూడ నాత్మరక్షణమునకై కత్తిఁదీయక తప్పి నదికాదు. అస్మానుఖాను జగత్సింహుని జంపుట కెన్నియో ప్రయత్నములు చేసెనుగాని జగత్సింహుఁడు జాగరూకుఁడై తప్పించుకొనుచుండెను. కాని యాతఁ డస్మానుఖానుని గొట్టుటకుఁ బ్రయత్నించుటలేదు. తనదెబ్బలను గాపాడుకొనుట యందే నిశ్చలుఁడై యుండెను. ఆయుధవిద్యావిశారదు లగు నాయిరువురు నీవిధముగాఁ జాలసేపటివఱకును బోరాడిరి. కాని రాజపుత్రునికి విశేషముగ గాయములు తగిలెను. పఠానున కొకదెబ్బయైనఁ దగులలేదు. పఠానుఁడు కోపముతోఁ గొట్టుచుండెను. రాజపుత్త్రుఁ డాతనిపైఁ జేయిచేసికొనుటలేదు. ఇఁక రాజపుత్త్రునకు జీవితాశ యెట్లుండును? ఇఁక జావు నిశ్చయమని తలంచి జగత్సింహుఁడు 'అస్మాన్! నేనోడిపోయితిని. ఇఁక విడువుము' అస్మానుఖాను నవ్వుచు 'ఏమి? చచ్చుటకు భయపడిన రాజపుత్రుని నే నెన్నఁడును జూడలేదు! కొట్టుము! కొట్టుము! నిన్నుఁ జంపక మానను. నీవు బ్రదికియున్నంతవఱకును నయేషా నాసొమ్ము కానేరదు' అనియెను.

జగ—నే నయేషాను బ్రేమించుటలేదు.

అస్మా—నీవు ప్రేమింపకున్నను, అయేషా నిన్ను బ్రేమించుచున్నది. మనకు యుద్ధము తప్పదు. నేను నిన్ను విడువను.

జగ—నాకు నీవు చాల నుపకారము చేసితివి. నేను నీతోఁ గత్తికట్టి పోరాఁడజాలను.

అని చెప్పుచు జగత్సింహుఁడు తనఖడ్గమును విసరి పారవైచెను. అస్మానుఖాను కోపోద్దీపితుఁడై జగత్సింహుని గుండెలపైఁ దన్ని 'చావునకు జంకినవారితో నేనిట్లే పోరాడెదను' అనియెను. రాజపుత్రునకు శాంతము నశియించిపోయెను. పారవేసినకత్తి నందుకొని యతివేగముగ నాతనిమీఁదికి లంఘించి తాఁకెను. ఆతాకున కస్మాను నిలువలేక పడిపోయెను. తోడనే జగత్సింహుఁ డాతనిగుండెలపైఁ గూరుచుండి కత్తిచే గంఠము నదిమిపట్టి 'ఇంకను నీకు నాతో యుద్ధముచేయుకోరిక తీరలేదా?' అనియెను.

అస్మా—నాప్రాణమున్నంతవఱకుఁ దీరదు.

జగ—నిన్నిప్పుడు చంపుటన నెంతపని?

అస్మా—సరె! చంపుము! నీగర్భశత్రుఁడు లేకుండఁబోవును.

జగ—ఉండనిమ్ము. రాజపుత్రులు శత్రువులనిన భయపడువారుకారు. నేను నిన్నుఁ జంపవలసినదేగాని నాప్రాణములఁ గాపాడిననిన్ను జంపుటకు నాకు మనసురాకున్నది.

ఇట్లు చెప్పుచు నాతనిబంధించి యాతనియాయుధముల నన్నిఁటిని లాగికొని మరల బంధములను విప్పి 'ఇఁక నీవింటికిఁ బొమ్ము! యవనుఁడవగునీవు రాజపుత్రుఁడ నగునన్నుఁ దన్నినందులకు నిన్నిట్లు చేయవలసివచ్చినది. కాని రాజపుత్రులు కృతఘ్నులై ప్రవర్తించువారు కారు! అని మందలించెను. అస్మాను మాఱుమాటాడక గుఱ్ఱము నెక్కి దుర్గమునకుబయలు దేరిపోయెను. జగత్సింహుఁడు తడిబట్టతో నొడలంతయు దుడిచికొని గుఱ్ఱము నెక్కి కళ్లెమును బట్టుకొనియెను. ఆకళ్లె

మున కేవియోతీఁగలు చుట్టుకొని యుండెను. వానిని దీసివేయు చుండఁగా నందొకయుత్తర మాతని కగపడియెను. అందు "అయ్యా! ఈయుత్తరమును రెండుదినములవఱకు విప్పవలదు. విప్పినచో నీయుద్దేశమున కాతంకము కలుగును' అని వ్రాయఁబడియుండెను.

రాజపుత్రుఁ డించుకయోచించి గ్రహించెను. ఆతఁ డాయుత్తరమును జదువకుండఁ దనతాయితులో నుంచుకొని గుఱ్ఱము నుడాయించి బయలుదేరిపోయెను. ఆతఁ డింటికిఁ బోయినతరువాత మూఁడుదినముల కాతని కింకొకయుత్తరము వచ్చెను. ముందుప్రకరణమున నాయుత్తరముంగూర్చి తెలిసికొందము.

---

పంచదశప్రకరణము.

అయేషా యొక యుత్తరమును వ్రాయుచుండెను. ఆమె ముఖము నందేకభావమును, గాంభీర్యమును, ముద్రితమై యుండెను. ఆమె జగత్సింహున కాయుత్తరము వ్రాయుచుండెను. అందు ప్రారంభమున 'ప్రాణాధికా!' 'ప్రియా!, 'మనోనాయకా' 'రాకుమారా!' అనుమాటలలో నేది వ్రాయవలెనో తెలియలేదు. అవి యన్నియు వ్రాసి మరల కొట్టివేయుచుండెను. తుదకు 'రాకుమారా!' అనివ్రాసెను. అప్పుడ కామెకన్నుల నుండి బాష్పబిందువులు కపోలములమీఁద నుండి జారి కాగితము పైఁబడెను. ఆకాగితమును జించివైచి అయేషా మఱియొక కాగితమును దీసికొని వ్రాయుచుండెను. అతికష్టము మీఁదఁ గన్నీరాపుకొని నాలుగైదుకాగితములు చింపివేసిన

పిమ్మట నుత్తరమును బూర్తిచేసెను. వ్రాసినదానిని మరలఁ జదువఁజూచెను. క్రమ్ముకొని పోవుచున్న కన్నీ రాయుత్తర మును జదువనీయలేదు. ఉత్తరమును మడచి దూతచేతి కిచ్చెను. ఆతఁడు రాజపుత్రసైన్యము విడిసియున్న వైపునకుఁ బోయెను. అయేషా యొక్కతెయు నిప్పుడు శయ్యపైఁ బడి దుఃఖించుచుండెను.

జగత్సింగుత్తరమును విప్పి యిట్లు చదివెను.

'రాకుమారా! నామనోధైర్యముపై నాకు విశ్వాస మున్నది. అందువలన భయముండి నిన్నుఁ జూడకుండనుండ లేదు. అయేషా తాలిమిలేని దనుకొనకుము. అట్లనుకొనుట నాకు విశేషబాధాకరము. అస్మాన్‌ఖాన్ మొదలే యేడ్పు చున్నాఁడు. ఆతనిఁ గష్టపెట్టవలసివచ్చు నని నేనురాలేదు. నీవర్ణనమునకు రానందులకు మఱియొకవిధముగఁ దలంప కుము. కష్టసుఖములకు భగవంతునిదే భారము. నిన్నొకసారి కలిసికొని కడసారి నిన్ను సెలవుతీసికొంటినేని యీదుఃఖమును నేను భరింపఁ గలిగియుందును. నిన్నుజూడరాక నేను కఠిన హృదయనై పోయితిని.

అయిన నిప్పుడీయుత్తర మెందులకు వ్రాసితినా? నా దొక్కమనవి. నేను నిన్ను సోదరివలెఁగాక యన్యథా ప్రేమిం చినట్లు నీవు తలంచితివేని యది మఱచిపొమ్ము. నేనది నీకుఁ దెలియనీయఁ దలంచి యుండలేదు. తెలియవలసివచ్చినది తెలిసి నది. ఆప్రేమము మఱచిపొమ్ము.

నిన్ను ప్రేమించుభాగ్యము నాకు లేదు. నీకీయవలసినది నీకడనేయుంచితిని. దానికి బదులగత్యము లేదు. నాహృద

మున కేవియోతీఁగలుచుట్టుకొని యుండెను. వానిని దీసివేయు చుండఁగా నందొకయుత్తర మాతని కగపడియెను. అందు "అయ్యా! ఈయుత్తరమును రెండుదినములవఱకు విప్పవలదు. విప్పినచో నీయుద్దేశమున కాతంకము కలుగును' అని వ్రాయఁబడియుండెను.

రాజపుత్రుఁ డించుకయోచించి గ్రహించెను. ఆతఁ డాయుత్తరమును జదువకుండఁ దనతాయితులో నుంచుకొని గుఱ్ఱము నుడాయించి బయలుదేరిపోయెను. ఆతఁ డింటికిఁ బోయినతరువాత మూఁడుదినముల కాతని కింకొకయుత్తరము వచ్చెను. ముందుప్రకరణమున నాయుత్తరముంగూర్చి తెలిసి కొందము.

పంచోద్మిదవప్రకరణము.

అయేషా యొక యుత్తరమును వ్రాయుచుండెను. ఆమె ముఖము సందేకభావమును, గాంభీర్యమును, ముద్రితమై యుండెను. ఆమె జగత్సింహున కాయుత్తరము వ్రాయుచుండెను. అందు ప్రారంభమున 'ప్రాణాధికా!' 'ప్రియా!, 'మనోనాయకా' 'రాకుమారా!' అనుమాటలలో నేది వ్రాయవలెనో తెలియలేదు. అవి యన్నియు వ్రాసి మరల కొట్టివేయుచుండెను. తుదకు 'రాకుమారా!' అనివ్రాసెను. అప్పటి కామెకన్నుల నుండి బాష్పబిందువులు కపోలములమీఁద నుండి జారి కాగితము పైఁబడెను. ఆకాగితమును జించివైచి అయేషా మఱి యొక కాగితమును దీసికొని వ్రాయుచుండెను. అతికష్టము మీఁదఁ గన్నీరాపుకొని నాలుగైదుకాగితములు చింపివేసిన

పిమ్మట నుత్తరమును బూర్తిచేసెను. వ్రాసినదానిని మరలఁ జదువఁజూచెను. క్రమ్ముకొని పోవుచున్న కన్నీ రాయుత్తర మును జదువనీయలేదు. ఉత్తరమును మడచి దూతచేతి కిచ్చెను. ఆతఁడు రాజపుత్రసైన్యము విడిసియున్న వైపునకుఁ బోయెను. అయేషా యొక్కతెయు నిప్పుడు శయ్యపైఁ బడి దుఃఖించుచుండెను.

జగత్సింగుత్తరమును విప్పి యిట్లు చదివెను.

'రాకుమారా! నామనోధైర్యముపై నాకు విశ్వాస మున్నది. అందువలన భయముండి నిన్నుఁ జూడకుండనుండ లేదు. అయేషా తాలిమిలేని దనుకొనకుము. అట్లనుకొనుట నాకు విశేషబాధాకరము. అస్మాన్‌ఖాన్ మొదలే యేడ్చు చున్నాఁడు. ఆతనిఁ గష్టపెట్టవలసివచ్చు నని నేనురాలేదు. నీవర్తనమునకు రానందులకు మఱియొకవిధముగఁ దలంప కుము. కష్టసుఖములకు భగవంతునిదే భారము. నిన్నొకసారి కలిసికొని కడసారి నిన్ను సెలవుతీసికొంటినేని యీదుఃఖమును నేను భరింపఁ గలిగియుందును. నిన్నుజూడరాక నేను కఠిన హృదయనై పోయితిని.

అయిన నిప్పు డీయుత్తర మెందులకు వ్రాసితినా? నా దొక్కమనవి. నేను నిన్ను సోదరివలెఁగాక యన్యథా ప్రేమిం చినట్లు నీవు తలంచితివేని యది మఱచిపొమ్ము. నేనది నీకుఁ దెలియనీయఁ దలంచి యుండలేదు. తెలియవలసివచ్చినది తెలిసి నది. ఆప్రేమము మఱచిపొమ్ము.

నిన్ను ప్రేమించుభాగ్యము నాకు లేదు. నీకీయవలసినది నీకడనేయుంచితిని. దానికి బదు లగత్యము లేదు. నాహృద

యము నీకడ నుంచితిని. నీహృదయమును ధ్యానించుచు నాప్రేమబలమున బ్రతుకుదును ఇప్పుడీప్రసంగ మనగత్యము.

నీదురవస్థలో నేను నిన్నుఁ జూచితిని. నీకేదైన కష్టము వచ్చిన నయేషాకుఁ దెలుప నిష్టమున్నచో నాకుఁదెలియఁ బఱుపుము. నీకష్టసమయములం దయేషా జ్ఞాపకముండిన చాలును.

నీకీయుత్తరము వ్రాయుట లోకవిరుద్ధము. నేను దోష మెఱుఁగను. లోకులమాటల పాటసేయకుము. నీకిష్టమైనప్పుడు నాకుమాత్ర ముత్తరము వ్రాయుచుండుము.

నీవిప్పుడు పోవుచున్నావు. పఠానులు శాంతస్వభావము కలవారు కారు. నీవు మరల నీదేశమునకు రావలసి వచ్చినను నన్నుఁజూడరాకుము. స్త్రీలహృదయముల నమ్మరాదు. అవి వశ్యములు కావు.

'నిన్నొకసారి చూడవలయు నని యున్నది.' నీకీదేశమునఁ బెండ్లియైనచో నాకు వ్రాయుము. నేను స్వయముగ నీ పెండ్లికి వత్తును. నీభార్యకుఁ గొన్నియాభరణముల దాఁచి యుంచితిని. అవి యాసమయమున నామె కలంకరించి నాహస్తములను ధన్యము లగునట్లు చేసికొందును.

ఇంకొక్క మనవి. అయేషా యిఁక నీలోకమును వీడి పోయినదని వినినప్పుడు నీవొక్కసారి యిటకు రమ్ము. నీపేరు వ్రాసియుంచిన పెట్టెలోనున్నవానిని నీవంగీకరింపుము. నాతండ్రి నాకుఁ గొంతధనమిచ్చియున్నాఁడు. అది స్వల్పమైనను మీదేశము నది గొప్పగనే చూతురు. అంబరుప్రభువుల కవియంట

రానిదైనను నీవు నాకొఱకది గ్రహింతువా! దానపత్రమా పెట్టియందే యుండును.

ఇఁక నేమి వ్రాయను? ఎంతయైన వ్రాయఁ గుతూహల మున్నదికాని దానివలన లాభములేదు. భగవంతుఁడు నిన్ను రక్షించునుగాక! అయేషా విషయమై నీకెన్నఁడు నసౌఖ్యము రాకుండుఁగాక."

ఉత్తరమును జదువుకొని జగత్సింహుఁ డేడ్చుచుండెను. కొంతవడికి ధైర్యము నొంది యీక్రిందివిధముగ ప్రత్యుత్తరము వ్రాసి యిచ్చెను.

"అయేషా! నీ వాఁడువాండ్రలో నుత్తమురాలవు. ప్రపంచమునఁ గష్టములే గలుగఁజేయుట భగవదుద్దేశమా? నీ యుత్తరమునందలి యేయంశమునకు నేను ప్రత్యుత్తర మీయఁగలను? నీయుత్తరముచే నేనొడలు మఱచితిని. నిన్ను నేనెప్పుడును బ్రియతమ యగుసోదరివని తలంచెదను." దూత యాయుత్తరము నయేషా కిచ్చివేసెను.



## ఇరువదియవ ప్రకరణము.

అయేషాకడ సెలవుతీసికొని యాస్మానితోఁ దిలోత్తమ వెడలిపోయినపిమ్మట నామె యేమైనదియుఁ దెలియలేదు. మానసింహుఁడును బఠానులునుగూడ నిప్పుడు సంధియగుటచే వీరేంద్రసింహునకు జరిగిన యన్యాయమునుగుఱించి విచారించిరి. తిలోత్తమను గనుగొని యామెను మందరగడమున నిలుపఁ దలంచిరి. తిలోత్తమ, విమలను గనుగొనిన వారి కొక

జహాగీరిచ్చెదనని మానసింహుఁడు ప్రకటించెను. ఏకారణముననైన నేమి జగత్సింహుఁడుకూడ వారలఁ గనుగొనుటకు బ్రయత్నించుచుండెను.

రెండుదినములు గడచినవి. మూఁడవదినమున మానసింగు సేనలతో బయలుదేరును. నాఁడే జగత్సింహుఁడు గుప్తపుఁగళ్లెమునకుఁ గట్టియున్నయుత్తరమును జదువవలసిన దినము. జగత్సింగాయుత్తరము నాతురతతో విప్పెను. అందిట్లున్నది.

"నీవు మంచియుద్దేశములు కలవాఁడవై,
పాపభీతి యుండినచో బ్రాహ్మణశాపము
నకు భయముండినయెడల నీయుత్తర
మునుజదివినతోడనే యీయుత్తరముకట్టి
నచోటికిఁ దక్షణమొంటరిగా రావలెను.

ఒక బ్రాహ్మణుఁడు."

రాజపుత్త్రుఁ డాశ్చర్యము నొందెను. 'ఇది శత్రువుల మోసము కాదుగద!' అని సందేహించెను. దేవనాగరాక్షరములయందున్న యాయుత్తర మొక బ్రాహ్మణుఁడే వ్రాసియుండవలెనని నమ్మెను. ఏది యెట్లున్నను బ్రాహ్మణశాపమన్న రాజపుత్త్రులకు భయము. 'నానిమిత్తము మీరు కనిపెట్టుకొని యుండవలదు. మీవెనువెంటనే వచ్చెద' నని పరివారముతోఁ జెప్పి యాతఁ డస్మానునితో యుద్ధమొనరించిన పాడింటికడ కడవికిఁ బోయెను.

అచ్చట నొకబ్రాహ్మణుఁ డస్మాని పేర్చియుంచిన చితిపై గూరుచుండి కన్నులుమూసికొని యేడ్చుచుండెను. 'నన్ను

రమ్మని వ్రాసినదిమీరా?' అని జగత్సిం గాతని నడిగెను. ఆ బ్రాహ్మణుఁడు కన్నులు తెఱచిపైకిఁ జూచెను. అతఁ డభిరామ స్వామి. జగత్సింగు వందనము లర్పించి నన్ను రమ్మనిన దెందుల కని యడిగెను.

'తిలోత్తమ మరణించుచున్నది. అని యభిరామస్వామి' యనెను.-

శైలేశ్వరసన్నిధానము మొదలు జరిగినసంగతులన్నియు జగత్సింహునకు జ్ఞప్తికి వచ్చెను. ఆతనికిదుఃఖ మతిశయించెను.

'తిలోత్తమబ్రతుకు దారిలేదు. కడపటిసారి నిన్నుఁ జూచుననిరమ్మంటిని. ఈకష్టములకుఁ గారణము నీవెఱుఁగనిది కాదు. ఆమెకు శరీరపీడలేదు. మనోవ్యాధికి మందుకలదా?' అని యభిరామస్వామి యేడ్చుచుండెను. జగత్సింగు నేడ్చు చుండెను.

తుదకు జగత్సింహుఁ దిలోత్తమకుఁ జూపిరి. అచ్చట విమల—ఇదివఱకు నిరంతరయౌవనమతి—ఇప్పుడు భర్తహీన వృద్ధాంగనయై— ఆమె కుపచారములుచేయుచు దుఃఖించు చున్నది. జగత్సింగునకు వారిరువురను జూచుసరికి దుఃఖ మతిశ యిల్లెను.

తిలోత్తమ జగత్సింగును చూచెను. ఆమెకన్నులవెం బడి నశ్రుధారలు కాల్వలు కట్టుచుండెను. రాజపుత్రునిగుండెలు నీరయ్యెను. ఆమెకు ధైర్యముచెప్పుచు శయ్యపైఁ గూరుచుం డెను. విమలయుపచారములవలనను, జగత్సింగు కన్నీటివలనను

శాంతవచనములవలనను, తిలోత్తమ కొనయూపిరి నిలువఁబడి నది. నాలుగైదుదినములలో మార్గమునఁ బడినది. తిలోత్తమ జగత్సింహునియొడిలోఁ దలనుంచుకొని శయ్యప్రక్క గూరుచుండినవిమల వినుచుండఁ దనకష్టములను, విచారములను, మనోభావములను, స్వప్నములను బూసగ్రుచ్చినట్లు జగత్సింహునకు వినిపించెను. ఆమె మాట లన్నిటియందు నామె పవిత్రచరిత్రమును, ఆమెకు జగత్సింహునిపైఁ గలయనన్యసామాన్యమైన ప్రేమమును, బ్రకటితమగుచుండెను. జగత్సింగు దుఃఖముచేఁ గరఁగిపోవుచుండెను. ఆమెకారోగ్యము కలిగినపిమ్మట నతఁడు తిలోత్తమను బెండ్లియాడుదు ననిచెప్పెను. అభిరామస్వామియు, విమలయు నతులోత్సాహసముద్రమునమునిఁగి యాతని నాశీర్వదించిరి. తిలోత్తమ సంతోషము నెవరు వర్ణింపఁగలరు ?



ఇ రు వ ది యొ క ట వ ప్ర క ర ణ ము.

మందరగడములోఁ దిలోత్తమాజగత్సింహుల కతివైభవముతో వివాహము నభిరామస్వామి జరుపుచుండెను. జహానాబాదునుండి జగత్సింహుని బంధుమిత్రులు వచ్చిరి. జగత్సింహుని సమాచారమును విని యయేషాకూడ నావివాహమునకు వచ్చెను. పరమానందస్వరూపిణి యగునయేషా దుఃఖమును మఱచి తనతేజఃపుంజముచే నచ్చటివారల నందఱ సుఖస్వరూపుల నొనరించుచుండెను. వివాహము పూర్తియగునప్పటికి రెండుయామములు దాటినవి. అప్పు డయేషా మరలిపోవఁ

బ్రయాణమైనది. నవ్వుచు నామె విమలకడ సెలవుతీసికొనెను. ఏమియు నెఱుంగనివిమల "అయేషా! నీవు తప్పక నీవివాహ మునకు మమ్మందఱతేఁ బిలువవలెసుమా! మేము తప్పక రాఁగ లము" అనెను.

విమలను విడిచి యామె తిలోత్తమకడకువచ్చి యామె నొక యేకాంతభవనమునకుఁ దీసికొనిపోయి యిట్లనియెను.

"సోదరీ! నే నిప్పుడు వెళ్లిపోవుచున్నాను. నీకు భగవం తుఁడు సర్వసుఖములనిచ్చుఁగాక. ఇదియే నామనఃపూర్వకమైన ప్రార్థనము."

"నిన్ను మరల నెప్పుడు చూతునో కద!"

"మనము చూచుకొనఁజాలము కాని నన్ను మఱవ కుము."

'నా దొక్క-ప్రార్థన మున్నది. నన్ను రాకొమరునికడ నెన్నఁడు తలపెట్టకుము. అట్లుచేయనని వాగ్దాన మొనర్పుము' అని అయేషా పట్టుపట్టెను. తిలోత్తమ య ట్లొనర్చెను.

పిమ్మట నయేషా 'నీవు నన్ను మఱవకుండ నీస్వాల్పా లంకారముల ధరింపుము' అని కొన్నినగలను దీసి యామె కలంకరించెను. తిలోత్తమ యారత్నముల మెచ్చుకొనుచుండ "నీవు నీహృదయమును నేఁడలంకరించుకొనిన రత్నరాజ మనఁ దగు రాజరత్నముకడ నివి యొకలెక్క-యా?' అని యామె ముఖముపై దృష్టి సారించి యిట్లనుకొనెను. 'నే నేసుందర పురుషుని మనసార ప్రేమించితినో యారాకొమరుఁ డీకపటము లేని ముఖమండలమును జుంబించుచు సుఖపరంపరల నందు చుండును గాక! నే మరణించునప్పుడు కూడ నీదంపతులకు

సుఖమునిమ్మని భగవంతునిఁ బ్రార్థించుచు నీప్రాణములవిడుతును గాక!' అని యనుకొనెను.

'తిలోత్తమా! నీభర్త కార్యతత్పరుఁడై యుండును. నాకు సెలవిమ్ము! నీకు భగవంతుఁడు చిరాయురైశ్వర్యముల నిచ్చును గాక! నీవు రత్నరాజమగునా—నీరత్నరాజమును హృదయమున ధరింపుము.'

నీరత్నరాజమను నప్పటి కామెకుఁ గన్ను నీరువరదలై పోయెను. తిలోత్తమ చూచి 'అయ్యో! నీవేడ్చుచుంటివేల?' అని యడిగెను.

తక్షణ మయేషా మారుచెప్పక కన్నులు తెఱచెను. అచ్చట నిఁక నొక్కనిమిషమైన నాఁగక యీవలకు వచ్చి పల్లకి నెక్కెను.

ఆమె యింటికి వచ్చుసరి కింకను రాత్రి యున్నది. ఆమె దుస్తులను మార్చుకొనెను. తనమేడపై గవాక్షముకడఁ గూరుచుండెను. చల్లగాలి వీచుచుండెను. ఆకాశము నక్షత్రములు మినుకుమినుకుమనుచుండెను. బయట నెండుటాకులు గాలి కెగిరి మరమరమనుచుండెను. గుడ్లగూబ కీచుమని ధ్వనిచేయుచుండెను. అయేషా కూరుచుండియున్న గవాక్షము క్రింద కంచకములోఁ బ్రతిఫలించుచున్న యాకాశము కనఁబడుచుండెను. ఆమె వ్రేలినున్న యుంగరము నయేషా పైకిఁ దీసెను. అది వజ్రస్థగితమైనది వజ్రములయందు విషముండదా?

'ఈరత్నమును నూరి మ్రింగి నాతృష్ణనార్పుకొందును.' ఆమె మరల నిట్లనుకొనెను.

